'భూమి నా తల వెల నిర్ణయించు'

# సృజన

ఆధునిక సాహిత్యవేదిక

మాసపత్రిక

191

సెప్టెంబర్ 1991


నిర్వహణ

'సాహితీమిత్రులు'

# సృజన

## ఆధునిక సాహిత్యవేదిక


191 మాసపత్రిక సెప్టెంబర్ 1991


ఈ సంచికలో....




నిర్వహణ

'సాహితీమిత్రులు'

ఈ సంచిక రు. 5 సంవత్సర చందా రు. 50

Edited, Printed and Published by P. Hemalatha, Flat 11, Block 2, MIG II, Baghlingampalli, Hyderabad-500 044 and Printed at Nagendra Press, Vijayawada-520 002

Working Editor : Vara Vara Rao

# 'భూమి నా తల వెల నిర్ణయించు'

1985 సెప్టెంబర్ 3న వరంగల్‌లో ఉదయం పది గంటల సమయంలో పోలీసు శవయాత్రలో వెళ్తున్న పోలీసు అధికారులు తన క్లినిక్‌లో పసిపిల్లలకు చికిత్స చేస్తున్న పిల్లల డాక్టర్ రామనాథంగారిని సర్వీస్ రివాల్వర్‌తో కాల్చి చంపిన తర్వాత నుంచి గత ఆరు సంవత్సరాలుగా దేశవ్యాప్తంగా పౌరహక్కుల ప్రజాతంత్ర సంస్థలు ఆ రోజును పౌర ప్రజాస్వామిక హక్కుల దినంగా నిర్వహిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘానికి చిరకాలం రాష్ట్ర ఉపాధ్యక్షుడిగా వున్న డాక్టర్ రామనాథంగారి స్మృతికి పౌర, ప్రజాతంత్ర హక్కుల ఉద్యమ విస్తృతికన్నా తీర్చుకోగల ఋణంలేదు.

ఈ సంవత్సరం ముఖ్యంగా జనార్దనరెడ్డి ముఖ్యమంత్రిగా వచ్చినప్పటినుంచి పెచ్చుమీరిన పోలీసు కాల్పులు, బూటకపు ఎదురు కాల్పులు, లాకప్ మరణాలు, టాడా కేసులు, దళితులపై దాడులు దృష్టిలో పెట్టుకొని ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, ప్రజాతంత్ర హక్కుల పరిరక్షణ సంస్థ సంయుక్తంగా ఆగస్టు నెలంతా రాజ్యహింసను ఖండిస్తూ రాష్ట్ర వ్యాప్తంగా సభలు, సమావేశాలు, ఆందోళనను నిర్వహించాయి. ముగింపుగా ఆగస్టు 31, సెప్టెంబరు 1 తేదీల్లో హైదరాబాదులో ఈ అంశంపై అఖిలభారత స్థాయిలో ఒక సదస్సును నిర్వహించాయి. దాదాపుగా దేశంలో క్రియాశీలంగా పనిచేస్తున్న పౌర, ప్రజాతంత్ర సంస్థలన్నీ ఈ సదస్సులో పాల్గొన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో మాత్రమే కాకుండా, ఇంతకు ఎన్నో రెట్లుగా కాశ్మీర్, పంజాబ్, అస్సాం ఈశాన్య రాష్ట్రాలలో అమలవుతున్న మిలటరీ పాలన, హింసా దౌర్జన్యాల గురించి, ఎల్ టి టి ఇ సాకుతో తమిళనాడులో అమలవుతున్న విచక్షణారహిత నిర్బంధాలు, హింస గురించి, అంతటా అణచివేయబడుతున్న ప్రజల ప్రాథమిక హక్కుల గురించి ఇక్కడ ప్రస్తావన వచ్చింది.

ఈ సందర్భంగా ఆంధ్రప్రదేశ్‌లో మళ్ళీ ముమ్మరమయిన 'ఎన్‌కౌంటర్' హత్యల గురించి ఈ సభ రెండు వాస్తవాలను విశ్లేషించి వెలికి తెచ్చింది. ఎన్‌కౌంటర్‌లు అనేవి అవి మాటకున్న అర్థం సూచించినట్లుగా వాటంతటవి జరిగిగే

కావు. అవి ప్రభుత్వ పాలసీ ప్రకారం జరుగుతాయి. ప్రభుత్వం వద్దనుకుంటే ఆగి పోతాయి. 89 నవంబర్ ఎన్నికల సమయంలో ఎన్టీఆర్ ఒక విధాన నిర్ణయంగా ఆపేసిన ఎన్‌కౌంటర్ హత్యలు చెన్నారెడ్డి అధికారంలోకి వచ్చాక 90 మే దాకా కూడా ఒక విధాన నిర్ణయంగానే ఆగిపోయాయి (పోలీసు ప్రభుత్వం తప్ప ఎవరి ప్రభుత్వమూ వుండని ఎన్నికల నిర్వహణ వ్యవధిలో మాత్రమే తూర్పు గోదావరి జిల్లాలో ఒక 'ఎన్‌కౌంటర్' జరిగింది).

'తుపాకీ రాజ్యం చేయను, తుపాకీతో రాజ్యం చేయనివ్వను' అని అధికారంలోకి రాగానే నిజాం కాలేజి గ్రౌండ్స్‌లో సభ పెట్టి బహిరంగ వాగ్దానం చేసిన జనార్ధనరెడ్డి నక్సలైట్లే తుపాకి రాజ్యం చేస్తున్నారని నమ్మించడానికి ఆ పేరుతో ఒక నాటకం తెలంగాణా జిల్లాలో ఆడించాడు. మెదక్ జిల్లాలో ఆ నాటకం ఆడుతూ ఎస్పీ నండూరు సాంబశివరావు నక్సలైట్లను కాల్చివేస్తే కేసులుండవని ప్రజలకు అభయమిచ్చాడు. ఆశ్రయమిస్తున్న వాళ్ళకొక గడువు నిర్ణయించి ఆ తేదీలోగా నక్సలైట్ల ఆచూకీ చెప్పకపోయినా, ఆ తర్వాత ఆశ్రయమిచ్చిన వాళ్ళను కూడ కాల్చివేస్తానన్నాడు. అన్నట్లే అహ్మదాబాద్‌లో పీపుల్స్‌వార్ కార్యకర్తలకు ఆశ్రయ మిచ్చిన తండ్రీ కొడుకులను గ్రామమంతా చూస్తుండగా ఆ కార్యకర్తలతో పాటు చంపేశాడు. పత్రికా రచయితలు నక్సలైట్లకు అనుకూలంగా రాస్తున్నారు కనుక వాళ్ళను తన్నమని ప్రజలను రెచ్చగొట్టాడు. వాళ్ళనుంచి ప్రతిస్పందన లేకపోయే వరకు పోలీసులే పత్రికా రచయితలపై కూడా కేసులు పెట్టి అరెస్టులు చేసారు. రాష్ట్రంలో చాలా చోట్ల పత్రికా రచయితలపై దాడులు చేశారు. చిత్రహింసలు పెట్టారు. తప్పుడు కేసులు పెట్టారు. నిజామాబాదు జిల్లాలో ఎస్పీ మీనా హయాంలో ఏభై యారు 'ఎన్‌కౌంటర్' హత్యలు జరిగాయి.

నేదురుమల్లి నేతృత్వంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడిన ఎనిమిది నెలల కాలంలోనే దాదాపు ఏభై ఎన్‌కౌంటర్ హత్యలు జరిగాయి. ఎన్నికల కాలంలో కరీంనగర్ కాచినేపల్లి వంటి 'ఎన్‌కౌంటర్'లో ఎన్నికల్లో పాల్గొంటున్న ఎం. ఎల్. పార్టీల కార్యకర్తలను హత్యచేసి ఓటర్లను భయ భీతావహులను చేయడానికే చేసారు.

చెన్నారెడ్డి హయాంలోనే నర్మెట, అస్సాంపేటలలో రాడికల్స్ ప్రదర్శనలపై, సభలపై ప్రారంభమైన నిషేధాలు, నిర్బంధాలు, ధిక్కరించిన చోట పోలీసుకాల్పులు,

చిలుకలూరిపేటలో ఎరువులకోసం ప్రదర్శనలు జరిపిన రైతులను కాల్చి చంపేదాకా జనార్దన్‌రెడ్డి హయాంలో పురోగమించాయి.

పదిరికుప్పం కారంచేడులను మరపించి కిల్వెన్మణి, బెల్చీలను తలపింపచేసిన చుండూరు దళితులపై హత్యాకాండ ఎన్టీఆర్ వంటి దోషికి కూడ జనార్దన్‌రెడ్డిని దోషి అని వేలుపెట్టి చూపేంత నోరునిచ్చింది. ఈ సంపాదకీయం రాస్తుండగానే వచ్చిన వార్త చుండూరు దళిత శిబిరంలో ఆమరణ నిరాహారదీక్ష చేస్తున్న దళిత బాధితుల కమిటీ సభ్యులపై పోలీసులు కాల్పులు జరిపారు. ఆ కమిటీ ఉపాధ్యక్షుడు అనిల్‌కుమార్ ఈ కాల్పుల్లో మరణించాడు. చుండూరు దళిత బాధితుల శిబిరం ఇప్పుడు పూర్తిగా పోలీసు వలయంలో వుంది. ఈ పోలీసు కాల్పుల్లో ఎందరో దళితులు, ముఖ్యంగా ఆమరణ నిరాహారదీక్ష చేస్తున్నవాళ్ళు తీవ్రంగా గాయపడ్డారు. వీళ్ళంతా ప్రభుత్వమే ప్రకటించిన హామీలు, తాము న్యాయమని భావిస్తున్న డిమాండులు సాధించుకోవడానికి గాంధేయ మార్గంలో పోరాడుతున్నవాళ్ళే.

ఇదే తుపాకీ రాజ్యం కొనసాగనివ్వనని, తుపాకీతో రాజ్యం చేయనని అధికారంలోకి రాగానే నేదురుమల్లి చేసిన ప్రకటన అమలుతీరు.

కేంద్రంలో కాంగ్రెస్ అధికారానికి వచ్చాక హోంమంత్రి ఎస్. బి. చవాన్ నక్సలైట్ల సమస్య శాంతి భద్రతల సమస్య మాత్రమేకాదు, ప్రధానంగా ఆదివాసులకు, అణచివేతకు గురవుతున్న వాళ్ళకు సామాజిక, ఆర్థిక న్యాయం జరిగేదాకా వుంటుంది అన్నాడు. ఈ మాట ఎప్పుడో ఒకసారి అనని ప్రభుత్వాధినేతలు లేరు: డి.జి.పి. స్థాయి పోలీసుఅధికారులులేరు. కరడుగట్టిన నక్సలైటు హంతకులయిన మీనా వంటి పోలీసు అధికార్లు కూడ ఇది కేవలం పోలీసులు పరిష్కరించే సమస్యకాదు దీనికి సామాజిక పరిష్కారం కావాలన్నారు. కాని ఐదు రాష్ట్రాల ముఖ్యమంత్రులను కేంద్ర హోంమంత్రి సమావేశపరుస్తాడు. ఐదు రాష్ట్రాల డిజిపిలు సమావేశమవుతారు. కాని ఐదు రాష్ట్రాల గిరిజన సాంఘిక సంక్షేమ మంత్రులుగానీ, వెనుకబడిన తరగతుల, మహిళాభ్యుదయశాఖలకు సంబంధించిన మంత్రులుగానీ సమావేశమై ఈ సమస్యను చర్చించినట్లు ఎప్పుడూ వినం. ఇది సామాజిక ఆర్థిక సమస్యే అని ప్రభుత్వం అనుకున్నప్పుడు మన ఐదు రాష్ట్రాల డిజిపిలు, పోలీసు అధికారులు ఎందుకు సమావేశమై ఏం చర్చిస్తున్నట్లు అని రాజ్యహింసను ఖండిస్తూ జరిగిన సదస్సుసరిగానే అడిగింది. మాటలేం చెప్పినా ప్రభుత్వం ఈ నక్సలైటు ఉద్యమాన్ని

శాంతి భద్రతల సమస్యగానే చూస్తున్నది. భూమి కొరకు, భుక్తి కొరకు చేసే పోరాటాలు మొదలు ఆత్మగౌరవం కోసం, స్వేచ్ఛా జీవనం కోసం, అంతిమంగా దోపిడీ సంకెళ్ళనుంచి విముక్తికోసం చేస్తున్న విప్లవాల వరకు అన్నింటినీ శాంతి భద్రతల సమస్యగానే చూస్తున్నది, ప్రత్యామ్నాయ రాజకీయాల గురించి ఆలోచించి, మాట్లాడి, ఆచరిస్తున్నవాళ్ళను తుపాకీ రాజ్యం ద్వారానే అణచివేస్తున్నది. అంతం చేస్తున్నది.

ప్రభుత్వం ఒక విధానంగానే 'ఎన్‌కౌంటర్'లు చేస్తున్నది, కనుక ఒక పాలసీగానే అవి మానుకోవాలి అని ఈ సదస్సు డిమాండు చేసిన రోజే సెప్టెంబర్ 1 ఆదివారం వేకువజామున మెదక్‌జిల్లా నర్సాపూర్ హైదరాబాద్ రోడ్డుపై పీపుల్స్‌వార్ జిల్లాకమిటీ సభ్యుడు కామ్రేడ్ జనార్దన్‌ను, ఆయనను మోటారుసైకిల్‌పై తీసుకు పోతున్న వ్యక్తిని పోలీసులు పట్టుకొని కాల్చివేసారు. రోడ్డుపై కాపుకాసి జనార్దన్ తొడలో కాల్చి చుట్టుముట్టి అరెస్టుచేసి పోలీసుస్టేషన్‌కు తీసుకువెళ్ళి ఎస్పీకి సమాచారమందించి కాల్చివేసే ఉత్తర్వులు తీసుకొని నర్సాపూర్ తాలూకా పాంబండ గ్రామం వద్దకు తీసుకువెళ్ళి కాల్చిచంపారు. మే నెలలో సుధీర్‌కుమార్‌ను తీసుకు వెళ్ళి వదిలేసిన స్థలమిది కనుక ఇది ప్రతీకారం! పోలీసుల ప్రతిచర్య !

నక్సలైట్ల చేతుల్లో ప్రాణభిక్ష పొందిన సుధీర్‌కుమార్‌కు పోలీసులు 'విధి నిర్వహణ'లో భాగంగా సమర్పించుకున్న కానుకలివి!

'రాజ్యహింస'ను ఖండిస్తూ రాజ్య హింసే ప్రైవేటు హింసకు దోహదం చేస్తుంది. ఒక్కొక్కసారి ఇంక అది తప్ప గత్యంతరం లేదేమోనని ప్రజలు భావించేలా చేస్తుంది అని ఈ సదస్సు కాశ్మీరు, పంజాబ్, అస్సాంలు మొదలు దేశ వ్యాప్తంగా ప్రజాస్వామికమైన, చట్టబద్ధమైన, న్యాయమైన డిమాండ్ల కోసం ప్రారంభమైన ఉద్యమాలు అన్నీ ఇవ్వాళ ఎందుకు సాయుధం కావాల్సి వస్తున్నదో పరిశీలించాల్సిన బాధ్యత ప్రజాతంత్ర వాదులపై వుందని చెప్పింది. సింగరేణి బొగ్గు గనుల్లో మాఫియా హింసకు ప్రతిగా ఏ నలుగురు చేరి ఆయుధాలు పట్టుకొన్నా ప్రజలు అది ఒక అనివార్య అవసరంగా భావించే పరిస్థితులు ఎందుకు వచ్చాయో ఆలోచించమని చెప్పింది. ఏ హింస అయినా చెడ్డదే, అని చెప్పడానికి మనం మేధావులం కానక్కర్లేదు. సామాజిక విశ్లేషణ చేసే బుద్ధి జ్ఞానాలు మనకుంటే అసమ సమాజమే ఒక హింసా రూపమని, అణచివేత, పీడన, దోపిడీలే సారాంశంలో

హింస అని, పాలకవర్గాలు ఈ హింసను ఆచరించడానికి రాజ్యాంగ యంత్రాన్ని ఒక పనిముట్టుగా వాడుకుంటాయని మనకర్థమవుతుంది. ఈ రాజ్యం మీద ప్రజల నియంత్రణ లేకపోతే అది నియంతృత్వానికి, ఫాసిజానికి దారి తీస్తుంది.

చరిత్రలో స్పార్టకస్ కాలానికో, జర్మనీలో హిట్లర్ కాలానికో వెనక్కు వెళ్ళనక్కర్లేకుండా నక్సలైటు ఉద్యమం గురించే వాస్తవాల్లోకి వెళ్తే నక్సల్బరీ గ్రామంలో పదకొండుమంది రైతులను పోలీసులు పొలాల్లో కాల్చి చంపిన నాటినుంచి, గిరిజన సభకు వెళ్తున్న కోరన్న, మంగన్నలను శ్రీకాకుళంలో భూస్వాములు కాల్చి చంపిన నాటినుంచి, బతుకమ్మ పండుగ దొర గడీలో కాక తమ ఇంటి ముందరే ఆడుకుందామన్న లక్ష్మీరాజ్యం, పోశెట్టిలను సిరిసిల్ల, జగిత్యాలలో భూస్వాములు చంపిననాటి నుంచీ, లొత్తునూరులో నీరేటికాడు పోచయ్యను పోలీసులు కాల్చిచంపిన నాటినుంచి, ఇంద్రవెల్లిలో అమాయక ఆదివాసులపై గుండ్లవర్షం కురి పించి అరవైమందిని పోలీసులు పొట్టన బెట్టుకున్న దగ్గర్నుంచీ, కంచికచెర్ల కోటేసు నుంచి,చుండూరు అనిల్ కుమార్ దాకా భూస్వాములు, పోలీసులు కొనసాగించిన హత్యా కాండ చరిత్రను చదవగలిగితే హింస ఎక్కడ ప్రారంభమవుతున్నదో గ్రహించడం కష్టంకాదు - మనకు కూడ పాలకవర్గాలు కొనసాగిస్తున్న దోపిడీ వ్యవస్థలో స్వప్ర యోజనాలు వుంటే తప్ప.

గత ఇరవై రెండేళ్ళలో వందలనుంచి వేల సంఖ్యలోకి వేగంగా వెళ్తున్న 'ఎన్‌కౌంటర్' హత్యలు, ఏడేళ్లుగా ఒకటీ రెండు పదాలనుంచి వందల సంఖ్యలోకి వెళ్తున్న 'మిస్సింగ్' హత్యలు (వరంగల్ జిల్లాలో కొన్నాళ్లుగా రోజూ గుర్తు తెలియని యువకుల శవాలు బయటపడుతున్నాయి, ఎన్నో గ్రామాల్లో తమ కొడుకులు ఏమయ్యారో తెలియని తల్లులు, భర్తలేమయ్యారో తెలియని భార్యలు ఆందోళనతో ప్రాణాలు బిగపట్టుకొని వున్నారు.) వేల సంఖ్యలో కూడా కేసులు, సామూహికంగా జనం కదలి ఆందోళన చేసిన చోట నిర్విచక్ష పోలీసు కాల్పులు ప్రశ్నించని చోట, ప్రతిఘటనను హింసగా చిత్రిస్తున్న చోట రాజ్యం చేసేది 'రాజ్యహింస'యే అవు తుంది.

అపుడు ఆశ్రమ పాఠశాల స్థితిగతులు తెలుసుకోవడానికి వెళ్ళిన నక్సలైటు యువకునికోసం ఆశ్రమ బాలబాలికలపై కూడ కాల్పులు జరిపి ఆదివాసీ సూరమ్మల

జీవితోదయాలను నెత్తుటి చీకటి మడుగులుగా మార్చి 'నక్సలైట్ల కోర్కెల సాధనకు మార్గమిదా?' అని ప్రశ్నించే గడుసుతనం మైసూరారెడ్డి వంటి గ్యాంగ్‌లీడర్‌లకు కూడ అబ్బుతుంది. ఆశ్రమపాఠశాలలో నక్సలైట్ల కోర్కెలేమున్నాయి. ఏమైనా వుంటే అవి ఆదివాసీ బాలబాలికలవి. ఆదివాసీ బాల బాలికలేకాదు, ఆదివాసీ ప్రజలకందరికీ సామాజిక, ఆర్థిక సమస్యలున్నాయని, అన్నింటికన్నా ముఖ్యంగా భూమి సమస్య వుందని ప్రభుత్వాలు, పార్లమెంటరీ ప్రతిపక్షాలు కూడ ఒప్పుకుంటూనే వున్నాయి. మరి ఈ మౌలికమైన అడవి సమస్యను, మైదాన ప్రాంతాలకు కూడ సారభూతమైన భూమి సమస్యను ఈ ప్రభుత్వం ఎట్లా పరిష్కరించదలుచుకున్నదో, అధికారంలోకి రాగానే జనార్దనరెడ్డి నిజాం కాలేజి గ్రౌండ్స్‌లో చేసిన ప్రకటన కాదు, ఇటీవల జారీ చేసిన ఒక ఫర్మానా ప్రతిఫలిస్తున్నది.

భూమి, భుక్తి, విముక్తి సమస్య తీసుకొని ప్రజలలో పని చేస్తున్న విప్లవ కార్యకర్తల తలలపై బహుమతులు ప్రకటించింది ప్రభుత్వం.

అప్పుడు 'సముద్రుడయి' ఆగ్రహించిన కామ్రేడ్ జనార్దన్ సవాల్ చేసాడు. 'భూమి నా తల వెల నిర్ణయించు' అని.

విరిగి ఎగిసే కెరటాలే తమ కష్టాలు, పోరాటాలు అయిన ప్రజా సముద్రం ఇవ్వాళ కోటి కోటి కెరటాల కన్నీటి నెత్తుటి ఆరాట పోరాట భాషలో అదే సవాల్ పదే పదే సంధిస్తున్నది. అది మృతవీరుల ఆకాంక్షలై అన్ని దిక్కులా ప్రతిధ్వనిస్తున్నది.

11-9-91 సంపాదకుడు

# నా తల్లి నన్నీదారిలోనే కన్నది

సముద్రుడు కవితలు మూడు :

ఈ దారి నా కన్నతల్లి
నన్నీ దారిలోనే గన్నది
కాపాడింది
నిలబెట్టింది
కుళాయి నీళ్ళ పేగుల్ని మెలి తిప్పినపుడు
ఉదయ విషాదాంధకారంలో కన్నీరు కరువైనపుడు
బతుకు బడి నీచకూపంగా మారినపుడు
మల విసర్జనలే నిర్బంధపు అన్నపానీయాలైనపుడు
నా తల్లి నన్నీదారిలోనే గన్నది
నన్ను నిలబెట్టింది
దారి కిరుపైపుల మోదుగు పూలు పూచినవేళ
శిశిరపు ఆకులు కన్నీటి బిందువులు రాల్చినవేళ
రెమ్మల్ని చీల్చి ఉరిత్రాడుకు బిగించిన వేళ
లతలు కాండాన్ని పెనవేసుకున్న వేళ
నా తల్లి నన్నీదారిలోనే గన్నది
నన్ను నిలబెట్టింది
జలబిందుపు శిలను ఛేదించిన
విడదీసిన కనుగుడ్డు గ్రెనేడ్‌లా పేలిన
ముదిరిన నాల్కను కొరడాలా సాగదీసిన
ప్రతి విపత్కర బిరడాల నధిగమించిన
నా తల్లి నన్నీదారిలోనే గన్నది
నన్ను నిలబెట్టింది
కాండంపై లోతైన గాయంలా
అడవుల నుండి పుట్టే రక్తపు వాగులా
మందుగుండు వాసనలో ఒదిగిన నిశ్శబ్దంలా

మౌనభాష నుదుటి రక్తసింధూరంలా
నా తల్లి నన్నీదారిలోనే గన్నది
నన్ను నిలబెట్టింది
ఏ తల్లి దుఃఖాన్ని జూసి ఏ కొడుకు నిరుత్సాహపడడు
ఏ తల్లి తన కొడుకుపై ఆశావాదాన్ని నిలుపుకోదు
వాడు మాతృభూమిని మగువ వలె ప్రేమించాడు
స్వేచ్ఛను మధువుగానే సేవింపతలచాడు
కాని తల్లీ !
నీ చనుబాల తీపి నెరిగిన వాణ్ణి
నీ గుండె వెచ్చదనంలో జీవిగా ఎదిగిన వాణ్ణి
నీ నుండి దూరంగా విడిపోలేని శక్తిహీనుణ్ణి
నీ గుండె కవాటాల వద్ద గార్డుగా నియమించబడ్డవాన్ని
నేను అచ్చంగా నీ రక్తపు జీవిని
నేను నీ వాణ్ణి

★

## బేబాకి

చావు ద్వారం వద్ద నిలబడి పిలుస్తుంటె
గేలి చేస్తూ పగలబడి నవ్వేవారెవరు ?
కబళించిన చావును తిరిగి విసిరి
గోడకు దిగ్గొట్టిన వారెవరు ?
సహబాష్ నా వీరులారా !
గోరీలు, చచ్చిన మనుషులకు కడుతుంటె
మీరు చావుకే గోరీలు కడుతున్నారు
సున్నం కొట్టిన సమాధుల్లాంటి మనుషుల్ని చూడండి
కనులకింపేగాని లోపలంతా దుర్గంధమే !
నిజం నా వీరులారా !

కళ్ళు చెమర్చడం కాదు
ధారావాహికంగా కారడంలో వింతేముంది
రక్తానికి కత్తుల్ని సానబట్టే చైతన్యముండొచ్చు
కాని
రక్తానికి గుండెల్ని కదిలించే శక్తి
కొందరి రక్త తర్పణాలతో శరీరాన్ని గగుర్పొరచే
శక్తి మనదని చూయించారు

రాత్రి తుపాకి శబ్దాలమధ్య గాయపడ్డ చంద్రుడు
రక్తవర్ణంలో రావడంతోనే అర్థమయింది
సత్యానికి సమాధి ఏదో శత్రువు కడుతున్నాడని
కమురు వాసనతో అలుముకున్న గాలి
విషాదంతోనే చెక్కిళ్ళను తుడిచింది
రాత్రి ఒరిగిన గడ్డి తెల్లవారి కన్నీళ్ళను కారుస్తుంది
బిడ్డలారా ఒక్కసారి కళ్ళు తెరవండి !
కూసింత తిని సేదతీర్తారని అనుకున్నాగాని
ఏందిది............ ?
ఎన్నడు కండ్లు తెరవకుండా నిద్రపోయారేంది ?
జీవితం రెండు పక్కల నుండి
వాడు బాడిసెతో చెక్కుతూనె ఉన్నాడు
దేవునర్రలో మీరు నిద్రపోతున్న వేడిగాలి
చల్లారనే లేదే ?
ఎవరో వచ్చారని తలుపుపై 'టకటక' కొట్టి
చప్పుడు చెయ్యొద్దని
ఇంకా నేను సైగలు చేస్తూనే వున్నాను
అయ్యో నా బిడ్డలారా !
నేనెలా యాది మర్సిపోయేది ?
కూడు బెట్టిన నా చేతులతో ఎవ్వడు సూడకుండ
కాకికెలా పెట్టేది ?

ఈ కూడు పెట్టిన చేతులతోనే
నా మనుమనికి
నా బిడ్డకి
నా అల్లునికి
తుపాకి ఇచ్చి వేటాకి చేసుకుంటాను బిడ్డా !
మీకింకేం ఇవ్వగలను చెప్పు
నా జీవితమా అయిపోయింది
కండ్లు ఆనడం లేదు
కాళ్ళకి కీళ్ళనొప్పులే
నడుమైతే వంగిపోయింది.
కాని
చేతిలో కర్రుంది బిడ్డా........
వుంటాను మరి........

★

## మీ పాటకు ప్రాణం మేమౌతాం

మీ బిగువైన వెచ్చని షేక్‌హాండ్
అనుభూతిని నేనింకా మర్చిపోకముందే
మీరదృశ్యమయ్యారనే నిజాన్ని ఎలా విశ్వసించాలి ?
వాడు మిమ్మల్ని చంపానంటున్నాడు.
ఎలా దిగమింగాలి ?

గాలిని
వెలుతురును
చివరికి ఉషోదయాన్ని కూడా
వాడు హత్య చేసాననే అంటున్నాడు
ఎలా నమ్మడం చెప్పు !
అయినా సరే వాడు హత్య చేసాననే అంటున్నాడు
మీరీ రోజు లేరని
చరిత్రహీనులు విందులు గావిస్తున్నారు

నిజమే
గాదెకింది పందికొక్కులు వీరవిహారం చేస్తున్నాయి
నిజమే........ నిజమే........
కాని
వాళ్ళ తలలకు వెలలు నిర్ణయించగలరు
తలల తీయడానిక్కైతం వెనుకాడరు
తెలిసే కదా మనం నడిచింది
నేస్తాలు !
బక్రి చెప్యాలలో వాడికి పుట్టిన గాబరాలోని
ఆనందాన్నుండి మేమింకా తేరుకోకుండానే
అహ్మదీపూర్ లో చుట్టుముట్టబడతారని
ఎవరూహించారు చెప్పు ?
నిన్న నక్సల్‌బరి బిడ్డలపాటకు మీరు స్వరమైనవారు
మరినాడు మీ పాటకు ప్రాణం మేమౌతాం
యుద్ధం మొదలైందే ఈనాడు
పాటకు పల్లవి ఆరంభమైంది........

("భూమి నా తల వెల నిర్ణయించు" కవితా సంకలనంలోనుంచి తీసుకున్నవి)

★

పాట :

## రండిరో దళితన్న

గద్దర్

రండిరో దళితన్న – దండు కట్టుదాం
చుండూరు భూస్వాముల – చుట్టుముట్టుదాం
దగాపడ్డ దళితులారా – దండు గట్టుదాం
చెరచబడ్డ చెల్లెలార – " "
వెనుకబడ్డ కులాల్లార – " "
ఎట్టి జేసే మనుషులార " "
చెమటోడ్చే జీవులార " "
అంటరానివాళ్ళం – పెనుమంట లవ్వుదాం ॥రండిరో॥

1. కంచికచెర్ల కోటేశు – కన్నులవ్వుదాం
నీరుకొండ దళితన్నల – నీడలవ్వుదాం
తిమ్మసముద్రం సెల్లెల – తిలక మవ్వుదాం
చుండూరు దళితన్నల – గుండెలవ్వుదాం
– కారంచేడు అలీసమ్మ కలలు నిజం జేద్దాం ॥రండిరో॥

2. అన్నా – హరిభూషనన్న – అడుగులవ్వుదాం
షేక్ ఇమామన్న – బాకు లవ్వుదాం
సింగరేణి రామస్వామి – సైరనవ్వుదాం
సెల్లి మన స్వర్ణలత – చేతులవ్వుదాం
– నక్సలైటు గంగన్న – గన్నులౌదాం ॥రండిరో॥

3. మతాలల్లో మర్మాన్ని – ఇప్పిచెప్పుదాం
దేవుళ్ళ గుట్టంతా – బయట బెట్టుదాం
గుణంలేని కులాల – గుట్టు చెప్పుదాం
– హిందూమత పిచ్చిగాళ్ళ – మత్తుదించుదాం ॥రండిరో॥

4. మన సెమటోడ్సిన – సెలకల్ని దున్నుకుందాం
మన నెత్తురు పత్తిసేలు – పంచుకుందాం
మనసెమటిచ్చిన – చెరుకు గడలు కొరుక్కుతిందాం ॥రండిరో॥

5. వెనుకబడ్డ కూలన్నల – కూడగట్టుదాం
కులపోరు వర్గపోరు – కలిపిపోరుదాం
భూమిపోరుతో మనపోరు – ముడిపెట్టుదాం
రైతు కూలీదండు కట్టి – రాజ్యమేలుదాం
మన బతుకిచ్చిన – భూతల్లిని విడిపించుదాం ॥రండిరో॥

పాట :

# ఉద్దానం జీడిపిక్క

వంగపండు

రెండు దశాబ్దాల తర్వాత శ్రీకాకుళం మళ్ళీ రగుల్కొంటోంది. 1972 తర్వాత ఈ ఆగస్టు 23న మందస మండలం, సిరిపురం పంచాయితీ పరిధిలోని పిల్లి బుడార్సింగ్‌లో 'ఎన్‌కౌంటర్' హత్య జరిగింది. మృతుడు జగబందు దళసభ్యుడు కూడా కాదని అధికారులే అంగీకరించారు.

శ్రీకాకుళంలో మళ్ళీ చిందిన నెత్తురు నేపథ్యంలో....

ఉద్దానం జీడిపిక్క<br>
ఉద్యమాల జీడిపిక్క<br>
తుపాకిని పట్టుకొందిరో ఓరన్నయో<br>
దాని రేపెంతో కట్టమందిరో

1. ఫైవ్‌స్టార్ హోటలోల్లు<br>
ప్రియా రుచి కంపినోల్లు ॥ఫైవ్॥<br>
పచ్చడి చేసే నన్ను<br>
లక్షలు కూ చేసిరని ॥పచ్చడి॥<br>
పుట్టిన సోటున నారేటు ఓరన్నయో<br>
పుట్టెడు రూపాయలందిరో ॥ఉద్దానం॥

2. పలాస షావుకార్లు<br>
పచ్చి పిక్కలమ్ముకొని ॥పూస॥<br>
మేలిమి బంగారం<br>
మేడలెన్నో కొన్నారని ॥మేలిమి॥<br>
కూలన్నకు కూడులేదని ఓరన్నయో<br>
కాలుతున్న నిప్పునందిరో ॥ఉద్దానం॥

3. పాతకుంచం పెట్టి
కాజా పద్దును పట్టి ॥పాతా॥
వొలిసిన పిక్కల్ని
వడ్డీకి దోచుకొనే ॥వొలిసిన॥
షాపారిని ఎజమానినిరో ఓరన్నయో
ఏటాడి పట్టుకుందిరో ॥ఉద్దానం॥

4. ఏరుకు నీరు పోసి
పువ్వుకు మరి ఎరువేసి ॥ఏరు॥
పెట్టిన మదుపైన
గిట్టలేదు రేటని ॥పెట్టిన॥
జీడిపిక్క రైతు చేతిలో ఓరన్నయో
రైఫోలు గుండుసందిరో ॥ఉద్దానం॥
అనాది రైతుఇంట
పుట్టి పెరిగినానని ॥అనాది॥
అమెరిక దొరలింటా
అహారం నేనని ॥అమెరిక॥
నా తండ్రి రైతును పెంచమందిరో ఓరన్నయో
లంచగొండిని ఉంచనందిరో ॥ఉద్దానం॥

5. పంచాది కృష్ణమూర్తి
ప్రాణిగ్రాహి సంగమేశం ॥పంచాది॥
నెత్తురు రాసినా
ఇత్తనాన్ని నేనని ॥నెత్తురు॥
బరంపురం దారిలోనరో ఓరన్నయో
బందూకును అందుకుందిరో ॥బరంపురం॥

విశ్లేషణ :

# నేటి కవిత్వతత్త్వం

త్రిపురనేని మధుసూదనరావు

ఇప్పుడు కవిత్వం పేరుతో వస్తున్నదంతా నేటి కవిత్వం. పరిశీలనా సౌలభ్యంతో సంచిత కాల పరిధిని తీసుకోవాలి కాబట్టి నేటి కవిత్వం అంటే 1970 నుంచీ 1990 మధ్య కాలంలో కవిత్వంగా భావించవచ్చు. కవిత్వంలో వర్గపోరాటం ఉధృతం కావడం, సాహిత్య స్వరూప స్వభావాల మీద తీవ్ర వాదోపవాదాలు జరగడం, కవిత్వంలో మౌలికమైన మార్పు తెచ్చిన విప్లవ రచయితల సంఘం స్థాపించడం కారణాలుగా నేటి కవిత్వ చరిత్రకి 1970 ప్రారంభ కేంద్రంగా తీసుకోవచ్చు. ఈ రెండు దశాబ్దాల కవిత్వాన్ని నేటి కవిత్వంగా అధ్యయనం చేయవచ్చు.

నేటి కవిత్వంలో బాగా పాత వాసనలు కొట్టే నిర్జన కవిత్వం కొనసాగుతూనే ఉంది. భారత, రామాయణాలు తిరగరాయడం, హనుమంతుడు, కుచేలుడు వంటి భక్తుల కథలు రాయడం, నోములూ, వ్రతాలూ, మహాత్మ్యాలూ కనకదుర్గ, కన్యకాపరమేశ్వరి శతకాలూ వస్తూనే ఉన్నాయి. రాశిలో ఇలాంటివి తక్కువేమీ కాదు. మిఠాయి అంగడి యజమానులూ, పదవిలో ఉన్న, పదవీ విరమణ చేసిన న్యాయమూర్తులూ, డబ్బు బాగా గడించి పుణ్యం సంపాదించుకోవాలనుకునే న్యాయవాదులూ, వైద్యులూ అందరికీమించి బ్లాక్‌మని బాబాలు ఈ నిర్జన కవిత్వాన్ని పోషిస్తున్నారు. ఈ కవులు అధికారుల ప్రాపకం సంపాదించి తమ పుస్తకాలని గ్రంథాలయాలకి అమ్మి డబ్బు సంపాదించుకుంటున్నారు. కవిత్వపరంగా సంధ్యావందనం, ఆంజనేయ దండకం, తద్దినం పెళ్ళి మంత్రాలకి ఉన్న ప్రయోజనం కూడా వీటికి లేదు. చెప్పిందే చెప్పడం, చెప్పిన రీతిలోనే చెప్పడంతో బాల పాఠకులు కూడా భరించలేని స్థితికి చేరుకుంది. వయస్సు పెరిగినా దాన్తోబాటు మెదడు పెరగని జబ్బుతో బాధపడేవాళ్ళు కనిపిస్తుంటారు. ఈ నిర్జన కవులూ ఆ కవిత్వ పాఠకులూ ఈ జాతికి చెందినవాళ్ళే.

నేటి కవిత్వంలో మరొక పాత ధోరణి ఆత్మకవిత్వం. ఆత్మ నిర్వికల్పం, నిరంజనం, నిరవధికం, శాశ్వతం. మార్పుని ధిక్కరించి సార్వకాలిక సార్వజనీన విలువల్తో నిండిన కవిత్వం. దీన్నే సంప్రదాయ కవిత్వమనీ, నవ్య సంప్రదాయ

కవిత్వమనీ ప్రచారం చేస్తున్నారు. వీళ్ళకి నిర్జన కవిత్వంమీద అంతులేని ప్రేమ ఉంటుంది కానీ బయటకు దాన్ని కొత్త రూపంలో ప్రదర్శించటానికి ప్రయత్నిస్తారు. సంప్రదాయం అనే ఒక అమూల్య నిధి ఉన్నదనీ దానిని కొనసాగించడమే కవిత్వ లక్ష్యమనీ ఆత్మ కవుల వాదం. సంప్రదాయానికి మార్పుకానీ నాశనంగానీ లేదని, వేదకాలం నుంచీ నేటి వరకూ అది అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నదనీ ఈ కవుల అభిప్రాయం. వాస్తవానికి అలాంటి సంప్రదాయం లేదు. ఉండే అవకాశం కూడా లేదు. విచ్ఛిన్నత అవిచ్ఛిన్నతలూ ఎప్పుడూ కలిసే ఉంటాయి. కొన్ని పాత విషయాలు సారాంశం మార్చుకొని ప్రజల్లో కొనసాగవచ్చు. సంప్రదాయం అంటే సమాజ అంతిమ లక్ష్యాలు. పూర్వ కాలంలో పురుషార్థాలు సమాజలక్ష్యాలు. రాచరిక వర్గం, పురోహిత వర్గం తమ ప్రయోజనాలకు అనుగుణ్యమైన లక్ష్యాలను సమాజ లక్ష్యాలుగా చేశారు. ఈనాటి సమాజ లక్ష్యం వర్గరహిత స్వేచ్ఛా సమాజం. ఇది కార్మికవర్గం మొత్తం సమాజ ప్రయోజనాలకు చరిత్ర పురోగమన సూత్రాల నుంచీ ఆవిష్కరించిన లక్ష్యం. రాచరిక, పురోహిత వర్గ మధ్యయుగ భావజాల ప్రచారమే ఆత్మకవిత్వం. గ్రాంధిక భాష, గణబద్ధ ఛందస్సు, అలంకార శాస్త్ర సిద్ధాంత చట్రం, రసవాదం పూర్వ సమాజ లక్ష్యస్తుతి సంప్రదాయ కవిత్వ లక్షణాలు, జాతీయ వాదం, మానవతా వాదం వంటి ఆధునిక వాదాలకు ప్రాచీన పురుషార్థ వాదానికి లంకె కలిపి నవ్య సంప్రదాయవాదం అంటున్నారు. ఈ లంకె ఏ విధంగానూ హేతుబద్ధంకాదు. పూర్వం అధికార వర్గంగా ఉండి ప్రజల్ని సాంస్కృతికంగా పీడించి సర్వ సౌఖ్యాలనూ అనుభవించిన వారి బలహీన వారసుల మృత్యు గీతమే నవ్యసంప్రదాయ వాదం. ఇది నిర్జన కవిత్వ ప్రౌఢ రూపం.

నిర్జన కవిత్వం, ఆత్మ కవిత్వం నేటి కవిత్వంలో కాలికంగా భాగాలే కానీ ఆధునిక కవిత్వంలో భాగాలు కావు. ఆధునిక విజ్ఞాన శాస్త్ర, సామాజిక, ఆర్థిక, రాజకీయ, తాత్త్విక, నైతిక శాస్త్రాల నేపథ్యం నుంచీ పుట్టి పెరుగుతున్నదే ఆధునిక కవిత్వం. మతవాదం ఆధునికం కాదుగానీ అంతిమంగా తెరచాటున మతంతో కరచాలనం చేసే భావవాద రూపాలు ఆధునికమే. సమాజానికీ కవిత్వానికీ, వ్యక్తికీ కవిత్వానికీ, ఆధునిక భావ ప్రపంచానికీ కవిత్వానికీ పరస్పర సంబంధం ఆధునిక కవిత్వ చర్చలో ప్రధానమైన అంశాలు. పదచిత్రాలూ భావాలూ, కవిత్వ అంతర్నిర్మాణం, కవి ప్రాపంచిక దృక్పథ వ్యక్తీకరణ విధానాలు, నిరక్షరాస్య ప్రజా సందో

హంలో కవిత్వ ప్రస్థాన మార్గాలూ ఆధునిక కవిత్వ సమస్యలు. ఇవి చాలా కాలంగా చర్చనీయాంశాలుగా ఉన్నప్పటికీ తెలుగు కవిత్వ రంగంలో 70 తర్వాత తీవ్ర తరమయ్యాయి.

సమాజంలో విద్యావంతులై కవిత్వం సృష్టించగల, అనుభవించగల ఒక బృందం ఉంది. కవిత్వ అభిరుచికి అర్హతలు, సంస్కారము గల శిష్టవర్గం ఇది. వీళ్ళ సమాజంలో చిన్నచిన్న ముఠాలుగా ఏర్పడి కవిత్వాన్ని గురించి చర్చించుకుంటూ అభినందించుకుంటూ ఉంటారు. ఈ బృందంలో కవులూ ఉంటారు. అభిరుచికారులూ ఉంటారు. కవిత్వ ఆరాధన కారణంగానే అచ్చుకి ధనసహాయం చేసే వాళ్ళూ ఉంటారు. ప్రజారాశులకు లేని సంస్కృతి తమకు ఉన్నదనే గుర్తింపును పొందడంకోసం ప్రయత్నంచేస్తూ ఉంటారు. సామాన్య ప్రజలకు 'నీచాభిరుచులు' ఉంటాయి. ఉత్తమ కవిత్వాన్ని అనుభవించే శక్తి వాళ్ళకు ఉండదు. శిష్టుల, సామాన్య ప్రజల అభిప్రాయాల, అభిరుచుల సంఘర్షణనుంచీ శిష్టులవైపుగా కవిత్వం అభివృద్ధి పొందుతుంది. ఇది శిష్టవాదం. ఆధునిక కవిత్వంలోని విభిన్న ధోరణులకు ఈ శిష్టవాదమే నేపథ్యం.

ఆధునిక కవిత్వంలో వివిక్త కవిత్వం ప్రధానమైంది. సమాజానికి కవిత్వానికీ సంబంధం పూర్తిగా తెగిపోయింది. కవిత్వం కవి స్వగతం. కవిత్వం కవికే అర్థం అవుతుంది. ఎవరికీ అర్థంకాకపోయినా నష్టంలేదు. అసలు కవిత్వం అంటే కవి రాసేదేకానీ పాఠకులకి అర్థమయ్యేటట్టు రాసేది కాదు. కవికీ ప్రజలకీ మధ్య కవితాభివ్యక్తి లేదు. అలాంటి అభివ్యక్తి సాధనాలు లేవు. ఇదే వివిక్త కవిత్వం. విభిన్నస్థాయిల్లో ఈ వివిక్తత ఆధునిక కవిత్వ సామాన్య లక్షణం. సమకాలిక అధిక సంఖ్యాక ప్రజల్తో సంబంధం తెంచుకున్నప్పుడే కవిత్వంలో కళాత్మకత నిగనిగ లాడుతుంది. శుద్ధ కవిత్వాన్ని సాధించాలంటే తాత్కాలికమైన, సంధి స్వభావం గల జీవితాంశాలకి కవి దూరంగా ఉండాలి.

ఫ్రాయిడిస్టులు రాసే సైకీ కవిత్వం ఆధునిక కవిత్వంలో మరొక ప్రబల ధోరణి. సైకీ అనేది మెదడుకి సంబంధించిందా, మనస్సుకి సంబంధించిందా అనేది తేల్చి చెప్పరు. కొన్ని విషయాల్లో మెదడుకి సంబంధించిందనీ, మరికొన్ని విషయాల్లో మనస్సుకి సంబంధించిందనీ చెపుతున్నారు. మెదడు భౌతికం, మనస్సు తాత్త్వికం అని ఇటీవల ఫ్రాయిడిస్టులు వాదిస్తున్నారు. సైకీలోని, ఉపచేతనలోని

అస్తవ్యస్త వంకర టింకర భావాల్ని వ్యక్తం చేయడమే కవిత్వం. విఫల వాంఛల విపరీత వ్యక్తీకరణమే కవిత్వం. ఆత్మన్యూనతా భావాన్ని కప్పిపుచ్చుకోవడానికి చేసే అసంబద్ధ ప్రయత్నమే కవిత్వం. దేశకాలాలు లేని మనొకడు పూర్తిగా పంచుకోవడానికి అవకాశంలేని సంకీర్ణ అనుభవానికి సైకీ కవిత్వం రూపం ఇస్తుంది. జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలద్వారా ఆ రూపం పాఠకుడి అనుభవంలోకిరాదు. సెక్స్‌కి సంబంధించిన అంశాల్నికూడా అసెక్స్‌గా సైకీకరిస్తారు. అభిధ, లక్షణార్థాలు ఇక్కడ పని చెయ్యవు. అర్థంమీద జరిగిన ఏ ఆధునిక పరిశోధనకీ సైకీ కవిత్వ అర్థం అందదు. ఈ కవిత్వం చదువుతుంటే మనస్సుకి ఏదోతడుతుంది. పాఠకుడు దాన్తోనే తృప్తిపడాలి. దీన్ని కొందరు అధివాస్తవిక కవిత్వం అంటున్నారు. కానీ తేడాఉంది. తెలుగులో అధివాస్తవిక కవిత్వం ఉందా అని సందేహం. ఇది మనిషి వ్యక్తిత్వ నిర్మాణంలో సామాజిక అంశాల్ని నిరాకరించే సైకాశ్రయ కవిత్వం.

ఆధునిక కవిత్వంలో అస్తిత్వవాద కవిత్వం రాత్రి కవిత్వం. అస్తిత్వవాదులు మనిషి జీవితంలో రాత్రికి ఇచ్చే ప్రాధాన్యం పగలుకి ఇవ్వరు. మనిషి అస్తిత్వం ముందు. తర్వాతే మనిషి సారాంశం. మనిషి అస్తిత్వం హేతుబద్ధం కాదు. ఎవడి అస్తిత్వం వాడి నీతిని నిర్ణయిస్తుంది. వ్యవస్థీకృత నీతిని ఆమోదించవలసిన అవసరం లేదు. నీతి ప్రవక్తలు అస్తిత్వ విరోధులు. జీవన బాధానందంలో అపశ్రుతులు. వ్యక్తి ఏకాంతుడు. విశ్వం, సమాజం - వీటితో వ్యక్తికి ఏమీ సంబంధంలేదు. నైరాశ్యం, మృత్యువు సత్యాలు. అవే అస్తిత్వ వేదనలు. సాంకేతిక ప్రగతి, ప్రజాస్వామ్యం వ్యక్తి అస్తిత్వానికి శత్రువులు. అస్తిత్వవాదులు కవిత్వ ఆరాధకులు. తత్త్వశాస్త్ర రూపంలో కంటే .కవిత్వరూపంలో అస్తిత్వవాదం చెప్పడం సులభం మృత్యువు, నైరాశ్యం, సాంఘిక సంస్థల పట్ల వ్యతిరేకత, జీవితంనుంచి స్వేచ్ఛ అస్తిత్వవాద కవిత్వ స్వభావం.

అమానవీకరణ ఆధునిక సమాజంలో ప్రచండంగా కొనసాగుతున్న క్రమం. మనిషి సృజనాత్మక శక్తుల ఫలితాలు మనిషికి విజాతీయమై, పీడిత శక్తిగా మారిపోతున్నవి. మనిషి ఒక సాధనంగా పనిముట్టుగా మాత్రమే మిగులుతున్నాడు. సమాజం, వ్యక్తికూడా కవిత్వానికి విజాతీయాలు. మనిషి సంవేదనలా, అనుభవాలా, సంఘర్షణ, ఆశయాలా కవిత్వానికి వ్యతిరేకాలు. ఆధునిక కవిత్వ ప్రయోజనం, ఫలితంకూడా అమానవీకరణమే. మనిషికి సంబంధించిన సర్వవిషయాన్నీ వదిలి

వెయ్యడం అనే అఖండ విజయసాధనే అమానవీకరణ కవిత్వం. చెట్లు, పుట్టలు, గోడలు, గొట్టాలు కంప్యూటర్లు, గాడిదలు, ఈగలు అమానవీకరణ కవిత్వంలో దర్శనమిస్తాయి. జీవిత నిర్జీవీకరణం ఆధునిక కవిత్వంలో ఒక ప్రబల ధోరణి.

సమాజంతోనూ, ప్రజలతోనూ కవిత్వానికి ఎలాంటి సంబంధం ఉండవలసిన అవసరంలేదనీ, ఉండకూడదనీ కూడా చెపుతున్న ఇలాంటి ఆధునిక కవిత్వ ధోరణులన్నీ బూర్జువా కవిత్వ ధోరణులే. ఇక్కడ బూర్జువా కవిత్వం అంటే బూర్జువావర్గం పోషించే కవిత్వం అని అర్థంకాదు. బూర్జువా వర్గానికి ఉపయోగపడే కవిత్వం అని అర్థం. బూర్జువా వర్గానికి కవిత్వంతో పనిలేదు. అందుకే కవితాహీన బూర్జువా ముఖాన్ని చూపలేక బూర్జువా కవులు బూర్జువా తాత్విక దృక్పథంనుంచే కొన్ని సందర్భాల్లో బూర్జువా వర్గాన్ని నిరసిస్తారు. అదీ చాలా దుర్బల నిరసన. ఆధునిక కవిత్వంలో తీవ్రమైన ప్రతీఘాతుక భావాలూ, ప్రపంచాన్ని గురించిన గందరగోళ భావాలూ స్థిరీకరణ పొందిన, జీవన రూపాలమీదా, సంస్కృతిమీదా నిరసన భావాలూ నూతన శిల్ప ధోరణుల్ని ఆవిష్కరించే ప్రయత్నాలూ కలిసి మెలిసి ఉంటాయి. ఆధునిక కవిత్వంలో శిథిలరూపం శిల్పాధిపత్య కవిత్వం. దీనిలో శిల్పమే కవితా వస్తువు. ఈ అల్పశిల్ప ప్రయోగాల వంకర పరిమితుల వల్ల అనిర్దిష్ట అర్థమర్మాలతో కవిత ఆంతరంగిక సౌందర్యశక్తిని కోల్పోయి శిథిల కళావశేషం అవుతుంది.

కమూక (mob) కవిత్వాన్ని ప్రజాకవిత్వంగా చిత్రించి శిష్టవాదులు నిరారిస్తున్నారు. మూకకళ బూర్జువా వ్యాపార కవిత్వం. ఫ్యూడల్ భావప్రచార కవిత్వం. శిష్టబృందంలోని క్షుద్రులు ప్రజల్ని అలగాజనంగా తయారుచెయ్యడానికి డబ్బు కక్కుర్తితో సృష్టించే కవిత్వం మూక కవిత్వం. ఇది సామాన్య ప్రజల్ని సంస్కృతీహీనులుగా, భీరువులుగా, అసభ్య, వికృతాభిరుచిగల వాళ్ళగా చిత్రిస్తుంది. మూక కవిత్వానికి రూపంలో ప్రజాస్వభావం ఉంటుంది. జానపద బాణీల్ని కూడా ఉపయోగించుకుంటారు. సినిమాపాటలు, అయ్యప్ప, సత్యసాయిబాబామీద పాటలూ, భజనపాటలూ, ఆర్. ఎస్. ఎస్. వాళ్ళ పాటలూ మూక కవిత్వంలో ముఖ్యమైనవి. వాస్తవాల్ని విస్మరింపచేసే మత్తునీ, నియంతృత్వంతో సర్దుకుపోయే క్రూరత్వ అనుభవాన్నీ, దురావేశాన్నీ, అసంస్కృత జీవన పద్ధతుల్నీ నిస్సహాయతనీ మూక కవిత్వం ప్రవేశపెట్టి ప్రజల్ని మూకలుగా తయారుచెయ్యడానికి విశ్వ ప్రయత్నం చేస్తుంది. అనేక కుహనాభావాలతో దారిద్ర్యాన్ని భరించేటట్టు చేస్తుంది.

మూక కవిత్వ లక్షణాలు ఆధునిక కవిత్వ ధోరణుల్లోనే అంతర్లీనంగా ఉన్నాయి. ఆధునిక కవిత్వం పద చిత్రాల కవిత్వం. ధోరణి ఏదైనా పద చిత్రాల ద్వారా వ్యక్తం కావలసిందే. భావాలకి ఏ మాత్రం ప్రాధాన్యం ఇవ్వకుండా పద చిత్రాల్లో మునిగిపోయే పదచిత్రవాదులూ ఉన్నారు. శుష్క పదచిత్ర ఆరాధనవల్ల కవిత్వం స్వప్న దృశ్యాలవలె, విడిపోతున్న మబ్బుతునకల్లాగా అసంగతమై పోతుంది. ఎన్నటికీ ఫలితాలు రాని ప్రయోగంలా శేషిస్తుంది. మొత్తంమీద ఆధునిక కవిత్వం భావాల ప్రాముఖ్యం లేని పద చిత్రాలమయమే. ఈ మూగ పదచిత్రాల్లోని దృశ్యాల నీడలు పాఠకుడి మనస్సుని ఆక్రమించుకొని అతని సంస్కారాన్ని, ఆలోచనా పద్ధతినీ, దృక్పథ పరిపక్వతనీ, సున్నితమైన అభిరుచినీ, తార్కికశక్తినీ భయంకరంగా వికృతం చేస్తాయి. సెక్స్, హింస, పాలకవర్గ జీవిత ఆదర్శీకరణ, అసాధారణ అపవాద అనుభవాలు, సైకీవికార క్రీనీడలూ, మానవత్వ అవిశ్వాసం, నిర్జీవ వస్తువుల నిరాకారత, తాగుబోతు స్వగతాలూ, అధీరత, మృత్యుభయం, ఆశారాహిత్యం, వైదేశిక ధూళి, వాత్సనిర్మాణ వైక్లబ్యం, వికట శబ్ద ప్రయోగం ఆధునిక కవిత్వ పదచిత్రాల లక్షణాలు.

శబ్దం మీద అధికారం లేని శబ్ద బానిసత్వం వల్ల కవిత్వంలో అస్పష్టత వస్తుంది. అధ్యయనం లేకుండా ఎవడికీ శబ్ద సంపద పెరగదు. తనంత తానే వచ్చేది ఏమీ లేదు. అనుభవం అనేది జ్ఞానానికి పాఠశాల వంటిది. అనుభవం నుంచీ పరిశీలన నుంచీ భావ పరిపక్వత ఏర్పడుతుంది. చెప్పదలుచుకున్న భావాలను వాస్తవాల నుంచీ ఉచిత శబ్దాల్లో భావనీకరించుకుంటే అస్పష్టత ఉండదు. జీవితంలో అస్పష్టత లేదు. మనస్సులో ప్రతిబింబించిన అనుభవాన్ని విశ్లేషించుకోవడంలో ఆ విశ్లేషణకి పద చిత్రరూపం ఇవ్వడానికి అనువైన శబ్దాలను ఎన్నిక చేసుకోవడంలో శక్తి లేకపోవడం వల్ల కవిత్వంలో అస్పష్టత వస్తుంది. అసమర్థతనుంచీ పుట్టిన అస్పష్టతని కవితా విలువగా ప్రచారం చేయడం సాహిత్య ద్రోహం. అస్పష్టత వేరు అనిర్వచనీయత వేరు. కవిత్వంలో అనిర్వచనీయత అనివార్యంగా ఉంటుంది. కవిత్వాన్ని అనుభవించడం ద్వారా అనిర్వచనీయతను అర్థం చేసుకుంటాడు. కవిత్వాన్ని అధ్యయనం చేయడంలో పాఠకుడికి కూడా బాధ్యత ఉంది. కవిత్వాన్ని అర్థం చేసుకునే సామర్థ్యాన్ని సంపాదించుకోవాలి. దినపత్రికలు కూడా అర్థం చేసుకోవడానికి శ్రమపడని వాడికి కవిత్వం అర్థం కాలేదు అనడం ఏ విధంగానూ

సమంజసం కాదు. ఆధునిక సమాజంలో వర్గ గందరగోళం, ఆర్థిక సంబంధాలకి అనుగుణ్యంకాని విదేశీ భావాల ప్రసారం. అర్ధ వలస అర్ధ భూస్వామ్య సమాజం మీద సాంకేతిక సమాజాలదాడి, ప్రాచీన ఆధునిక భావాల సంఘర్షణ, సిద్ధాంత స్థాయిలో ఆమోదించిన విలువలకీ ఆచరణలో విలువలకి వైరుధ్యం, స్వచ్ఛందనీతిని కోరుతున్న మనస్సు మీద నిర్బంధ నీతి దాడి చెయ్యడం, విముక్తి భావాల్ని ప్రచారం చేస్తూ సంప్రదాయికంగా జీవించడం జీవితంలో సంకీర్ణతకి కారణం. జీవితంలో సంకీర్ణత ఉంటే కవి దానిని విశ్లేషించుకొని కవిత్వం ద్వారా దాన్ని జయించడానికి ప్రయత్నించాలి కానీ తన కవిత్వంలో సంకీర్ణతని సమర్థించుకోవడానికి ప్రయత్నం చేయకూడదు. వివిధ ఆధునిక కవిత్వ ధోరణుల్లో అస్పష్టత, సంకీర్ణత ఉన్నాయి. మేధావులు కాని కవుల్లో ఈ లక్షణాలు ఎక్కువ ఉంటాయి. ఆధునిక కవుల్లో చాలామంది మేధావులుకారు.

1970-90 మధ్య కాలంలో ముఖ్యంగా 78 తర్వాత వచ్చిన కవితా సంకలనాలూ, వివిధ పత్రికల్లో వచ్చిన కవితలూ నేను చేసిన ఆధునిక కవిత్వ తాత్త్విక విశ్లేషణకు ఆధారాలు. ఈ కవులందరి పేర్లూ వాళ్ళ కవితల్నీ ఉల్లేఖించడం నా పద్ధతి కాదు. వాటిని కవులూ పాఠకులూ పరిశీలించుకోవచ్చు. ఈ ఆధునిక కవిత్వం తాత్త్విక పునాది భావవాదం. వీళ్ళ మీద సామ్రాజ్యవాద భావజాల ప్రభావం ఉంది. ఇది పాలక వర్గాలకి ఉపయోగపడే కవిత్వమే కానీ ప్రజలకు ఉపయోగపడేది కాదు. 1970కి ముందే ప్రసిద్ధులై ఇప్పటికీ రాస్తున్న కవులు కొందరు ఉన్నారు. వాళ్ళు సామాజిక ప్రయోజనం లేకుండా సమాజాన్ని గురించి రాయడంలో నిపుణులు. ఈతరం కవులమీద వాళ్ళ ప్రభావం ఏమీ లేదు. సన్మానాలు, బహుమతులు, విదేశ పర్యటనల గొడవల్లో పడి ఉన్నారు. మానవతా వాదం, జాతి, ప్రేమల మీద ఏడుపు కవిత్వం కూడా కొంతమంది రాస్తున్నారు. ఇది బలహీనమైన పిచుకవిత్వం. బడుగు కవిత్వం. శవం దగ్గర కూర్చుని ఏడిసేవాళ్ళని చూసి ఏడిసే కవిత్వం.

మనం ఒక మహత్తర పోరాటం మధ్య, విప్లవం మధ్య, యుద్ధం మధ్య పుట్టి పెరుగుతున్నాం. ఈ పోరాటంతో సంబంధం లేకుండా ఉండే హక్కుకానీ, ఈ పోరాటాన్ని తప్పించుకొని తిరిగే హక్కు గానీ మనకులేదు. కవులకూ, మేధావులకూ, విద్యావంతులకూ పోరాటంతో కలిసిమెలిసి ఉండటం అనివార్యమైన సామాజిక బాధ్యత. ప్రజల విప్లవకర పోరాటాల పట్ల తటస్థత కానీ, అలీనత కానీ, నిర్లిప్తత

కానీ ద్రోహం. ఇదే నక్సల్‌బరీ, శ్రీకాకుళ రైతాంగ పోరాటాల సందేశం. ఇదే చైనా సాంస్కృతిక విప్లవ సందేశం. ఈ సందేశానికి సమాధానమే 1970 లో విప్లవ రచయితల సంఘస్థాపన. ఆధునిక కవిత్వంలో కవిత్వ సమాజం, కవిత్వ ప్రయోజనం, కవి-కవిత్వం, కవిత్వ స్వరూప స్వభావాలు కవిత్వం ప్రజా పోరాటాలు మొదలైన మౌలిక విషయాలమీద విప్లవ రచయితల సంఘం విప్లవాత్మకమైన మార్పుని తీసుకువచ్చింది. 1940 ప్రాంతంలో ఇలాంటి చర్చ జరిగినప్పటికీ చర్చా సందర్భం, స్వరూపం, ఫలితాలూ, పరిణామాలూ దీనికి భిన్నమైనటువంటివి. విప్లవ కవిత్వం ఇతర ఆధునిక కవిత్వ ధోరణుల్ని సైద్ధాంతిక స్థాయిలో అభావం చేసి రచనా స్థాయిలో వాటి ప్రజా వ్యతిరేక సంకుచిత కళావిహీనతని బహిర్గతం చేసింది.

కవి సమాజంలో సమాజం ద్వారానే కవి అవుతాడు. కవి కవిత్వం రాయడానికి కావలసిన విశ్రాంతినీ, నైపుణ్యాన్నీ, విద్యా సంస్కారాల్ని పొందే అవకాశాల్ని శ్రమజీవులే ఇచ్చారు. శ్రమజీవులు తమ చెమటతో, రక్తంతో, మొత్తం తమ జీవితాలతో ఇచ్చిన అవకాశాన్ని కవులు వర్గ వాస్తవికత కారణంగా కొందరు శ్రామికులకు వ్యతిరేకమైన కవిత్వం రాస్తారు. శ్రామికుల ఉత్పత్తులు అనేకం శ్రమజీవులకు చెందక వాళ్ళకివి జాతీయమై, పీడిత శక్తులై వికటాట్టహాసం చేసినట్టు కవులుకూడా శ్రమజీవుల వ్యతిరేక శిబిరంలో చేరి వికృత, అవాస్తవిక, భ్రాంతిమయ కవిత్వం రాస్తారు. తమ మూలాన్ని విస్మరించడం వల్లనే కవులు నిరాశ, దుఃఖం, మృత్యువు, మతం, అరాచకత్వం మనోపంజరం కవిత్వం సృష్టిస్తున్నారు. కాబట్టి ఒకడు కవి కావడానికీ కవిత్వం రాయడానికీ సమాజమే కారణం. మరి ఏ ఇతర కారణం లేదు. విప్లవ కవులు కవిత్వ మూలశక్తులకు ఎదిగి శ్రమజీవులకు అంకితం అవుతారు. శ్రామిక వర్గానికి భిన్నమైన ప్రయోజనాలు విప్లవ కవులకు ఉండవు.

ప్రజల విప్లవకర పోరాటాలు, ఆ పోరాటాలకు సంబంధించిన తాత్త్వికసాంఘిక విషయాలే విప్లవ కవిత్వంలో వస్తువు. విప్లవం ప్రజా రాజకీయాధికార సమస్య కాబట్టి విప్లవ కవిత్వంలో విప్లవ రాజకీయాలు ప్రధానంగా ఉంటాయి. విప్లవ రాజకీయాలు లేకుండా విప్లవ కవిత్వం ఉండదు. విప్లవకారుల, ప్రజల విప్లవ కార్యాచరణే విప్లవ రాజకీయాలు. విప్లవ ఆచరణకి సంబంధించిన విప్లవ రాజకీయాలే విప్లవ కవిత్వానికి ప్రాణవాయువు. విప్లవ సిద్ధాంతం లేకుండా విప్లవం

లేనట్టే విప్లవ సిద్ధాంతం లేకుండా విప్లవ కవిత్వం ఉండదు. విప్లవానికి ఒక సిద్ధాంతం, విప్లవ కవిత్వానికి మరొక సిద్ధాంతం ఉండవు. విప్లవ సిద్ధాంతం లేకుండా విప్లవ పోరాటాల్ని మాత్రమే కవిత్వంలో ప్రతిబింబిస్తే ఏమవుతుంది ? ఆ పోరాటాలు ప్రజలకు మార్గదర్శకం కాకపోవడమేకాక విప్లవ పోరాటాలమీద బూర్జువా కవులూ, పాలకవర్గ అనుబంధ కవులూ చేసే తప్పుడు సైద్ధాంతిక ప్రచారాన్ని ప్రతిఘటించే శక్తి విప్లవ కవిత్వం కోల్పోతుంది. అధికార వర్గం విస్తృతమైన శక్తి యుక్తుల్తో ప్రజా పోరాటాల్ని గురించి చేసే ప్రజావ్యతిరేక సిద్ధాంతాలు సమాజంలో వివిధ శ్రేణుల్లో ప్రవేశపెట్టగలవు. కాబట్టి విప్లవ సిద్ధాంతంలేని విప్లవ పోరాటాల చిత్రణవల్ల విప్లవ కవిత్వం పోరాటాలకు నష్టం కలిగించగలదేకాని ప్రయోజనాన్ని కలిగించలేదు. అంతేకాక సాంస్కృతిక రంగంలో వివిధ భావవాద, మత ఛాందస, ప్రజావ్యతిరేక ధోరణుల్ని విప్లవ సిద్ధాంతం లేకుండా ఎదుర్కోడం సాధ్యమే కాదు. ఇంతకంటే ముఖ్యంగా రోజురోజుకీ మారణశక్తిగా విశ్వప్రదర్శనం చేస్తున్న రివిజనిజాన్ని ప్రతిఘటించటానికి విప్లవ సిద్ధాంతం ఏకైక ఆయుధం. సామ్రాజ్యవాదులు రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాల్లో ఉధృతంగా ప్రచారం చేస్తున్న 'అసిద్ధాంతీకరణ' ప్రయత్నాన్ని ఎదుర్కోవడానికి విప్లవ సిద్ధాంతం అవసరం. విప్లవ కవిత్వానికి మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం ప్రాపంచిక దృక్పథం.

వాస్తవ ప్రజా పోరాట పునాదితో, విప్లవ సిద్ధాంతం వెలుగులో విప్లవ కవులు జాతీయ, అంతర్జాతీయ ఘటనలమీదా, దేశదేశాల్లో విముక్తి పోరాటాలమీదా, సామాజిక సంఘర్షణలోని వివిధ విషయాలమీదా, రాజ్యాంగ హింసమీదా, ప్రజల హక్కుల పోరాటంమీదా, అనేక సూక్ష్మ దోపిడీ రూపాలమీదా, స్త్రీ పురుష సంబంధాలమీదా కవిత్వం రాస్తున్నారు. అంతర్జాతీయ కార్మికవర్గ దృష్టి విప్లవ కవిత్వానికి ఒక ముఖ్య లక్షణం. మన దేశంలో విప్లవం ప్రపంచ విప్లవంలో భాగమే. కానీ మనదేశంలో జరుగుతున్న విప్లవ పోరాటాల్తో సంబంధం లేకుండా, వాటిని పట్టించుకోకుండా విదేశాల్లో జరిగే పోరాటాల్ని గురించి రాస్తే అది విప్లవ కవిత్వం అనిపించుకోదు. ఇక్కడి పోరాటాల్ని పూర్తిగా విస్మరిస్తూ విప్లవ సిద్ధాంతంకూడా లేకుండా పనామా మీద అమెరికా దాడిని నిరసిస్తూ రాస్తే ఇక్కడి పాలకవర్గాలకి ఏమి నష్టం ఉంది. కాబట్టి అంతర్జాతీయ విషయాలమీద రాసినా, జాతీయ విషయాల

మీద రాసినా విప్లవ కవిత్వానికి గీటురాయి ఇక్కడ జరుగుతున్న రైతాంగ పోరాటానికీ, విప్లవ సిద్ధాంతానికీ నిబద్ధత. సామ్రాజ్యవాద, సోషల్ సామ్రాజ్యవాద ఆధిపత్య స్వభావాన్ని వివరించడానికి, మనదేశ ప్రజల పోరాటాల్ని ఉధృతం చెయ్యడానికి, ప్రజల్లో విప్లవ చైతన్యం పెంచడానికి, ప్రపంచ కార్మికవర్గ ఐక్యతకీ, ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమాల్ని ఉత్తేజం చేయడానికి ప్రపంచ దేశాల్లో ప్రజల పోరాటాల్ని విప్లవ కవిత్వం చిత్రిస్తుంది. అలా కాకపోతే అది వార్తా కవిత్వం అవుతుంది కానీ విప్లవ కవిత్వం కాదు. శ్రామికవర్గ అంతర్జాతీయతకీ భారతదేశంలోని ప్రజాస్వామిక విప్లవానికీ విప్లవ కవిత్వం గతితార్కిక సంబంధాన్ని చిత్రిస్తుంది.

జీవితాన్ని విప్లవీకరించడం, స్వేచ్ఛాభావాల్ని ప్రసరింపచేయడం, వివిధ శ్రేణుల ప్రజల్లో ప్రతిఘటనా శక్తిని పెంచడం సామాజిక త్యాగాన్నీ, ధైర్యాన్నీ రగిలించడం విప్లవ కవిత్వం సాధిస్తున్న మరొక విజయం. దేశంలోని సామాజిక సంస్థలు అన్నీ సంప్రదాయికతతోనూ, చట్టబద్ధతతోనూ, అణచివేతతోనూ, మానసిక జడత్వంతోనూ, విధేయతతోనూ ప్రజాస్వామిక స్వభావాన్ని కోల్పోయి రోజుకిరోజు ప్రతిధ్వనిగా నిర్జీవమై కుంచించుకుపోయాయి. ఈ సంస్థలన్నీ మనిషిని అధీరుడుగా, తప్పించుకు తిరిగేవాడుగా, స్వప్రయోజనాల పంజరంలో చిలకగా, గానుగ ఎద్దుగా తయారుచేసాయి. ఈ లక్షణాలుగల సామాజిక సంస్థల్ని విముక్తి భావాలతో కదిలించడానికి విప్లవ కవిత్వం ప్రయత్నిస్తున్నది. ఆలోచనాపరులైన విద్యావంతుల్లో విప్లవ భావ వాతావరణాన్ని కల్పించింది. పోరాట సైద్ధాంతిక నిబద్ధత స్వేచ్ఛకి వ్యతిరేకం కాదు. స్వేచ్ఛ కోసమే నిబద్ధత. సామాజిక ప్రగతి లక్ష్యాల సృజనాత్మక వ్యక్తీకరణే సృజనాత్మక స్వేచ్ఛ. దోపిడీని సమర్థించడం, ఫాసిజాన్ని సమర్థించడం, కాలదోషం పట్టిన విలాస వ్యతిరేకమైన సంప్రదాయాన్ని సమర్థించడం స్వేచ్ఛ కాదు. అది స్వేచ్ఛా రూపంలోని బానిసత్వం. 'నా ఇష్టం వచ్చినట్టు నేను రాస్తాను' అనేవాడు పాలకవర్గాలకి అనుకూలంగా రాస్తాడు. వ్యవస్థని మార్చే విప్లవకర భావ ప్రకటనా స్వేచ్ఛని, రచనా స్వేచ్ఛని పోరాటం ద్వారానే సాధించగలం. ఇదే విప్లవకవిత్వ స్వేచ్ఛా సిద్ధాంతం.

విప్లవ కవిత్వంలో కూడా వచన కవిత్వమే ప్రజలరూపం. శిల్పపరంగా, నిర్వహణపరంగా వచన కవిత్వంలో విప్లవ కవులు విలక్షణ విజయాన్ని సాధించారు. ఇతర ఆధునిక కవులు క్షీణ ప్రక్రియగా చేస్తుంటే విప్లవ కవులు వచన

కవిత్వాన్ని సజీవ కవితా ప్రక్రియగా చేసి రక్షించారు. గడిచిన రెండు దశాబ్దాల్లో విప్లవ కవులు శిల్ప, నిర్మాణపరంగా కూడా వచన కవితను పరిపక్వం చేశారు. కళాత్మకంచేశారు. కవిత్వం ఒక సంశ్లేషణ. ఒక అంగి. ఒక అవయవి. కవిత్వంలో ప్రతి భాగం మొత్తంతో మార్చాలి. మొత్తాన్ని మార్చాలి. ఏ అర్థం మరొక అర్థాన్ని అభావం చెయ్యదు. అభావాన్ని అభావం చేస్తూ పోతుంది. విత్తనం వృక్షమైనట్టు భావం పరిమాణాత్మకంగా వికసిస్తూ ఫలవంతం అవుతుంది. కవితా వస్తువులోని ఐక్యతనీ సంఘర్షణనీ ఉచితమైన పదచిత్రాల ద్వారా వ్యక్తం చేస్తుంది. వేళ్ళతో కొమ్మలతో రెమ్మలతో పూవుల్తో, కాయల్తో చెట్టు పరిణతమైనట్టు కవిత్వం సర్వాంగాలతో పరిపక్వం కావాలి. కవిత్వ నిర్మాణం నాటక నిర్మాణం వంటిది. విప్లవ వచన కవిత్వంలో ఈ అవయవి నిర్మాణం ఉంది.

విప్లవ వచన కవిత్వంలో కూడా పదచిత్రాలే ఉంటాయి. వస్తువు పదచిత్రాల్లో ఉండటం వచన కవిత్వ రూపలక్షణం. విప్లవ కవిత్వంలో పదచిత్రాలకి భావాలు ముడిసరుకు. వస్తుగత వాస్తవికత ప్రతిబింబమైన భావాలు, విప్లవకరభావాలు విప్లవ కవిత్వంలో పదచిత్ర రూపాన్ని పొందుతాయి. విప్లవ కవిత్వం కవిత్వంలో భావాల ప్రాముఖ్యాన్ని అంగీకరిస్తుంది. భావాల్ని పదచిత్రాల ద్వారా వ్యక్తం చేస్తుందేకానీ ఉదాహరణలద్వారా కాదు. పదచిత్ర రూపాన్ని పొందని భావాలు కూడా సందర్భం ఒత్తిడివల్ల విప్లవ కవిత్వంలో ఉంటాయి. కవిత్వంలో భావాల్ని సహించవచ్చు కాని భావనల్ని సహించలేం. శాస్త్ర ప్రతిపాదనా వాక్యాలు కానీ, అనిర్దిష్ట ప్రకటనా వాక్యాలుకానీ విప్లవ కవిత్వంలో ఉండకూడదు. తప్పనిసరిఅయితే ఆ వాక్యాలు కవితా నిర్మాణంలో కలిసిపోయే సందర్భాన్ని సృష్టించుకోవాలి. మొత్తం కవితలో ప్రాపంచిక దృక్పథం కలిసిపోవాలి, కరిగిపోవాలి. కవితలో పదచిత్రాలకీ భావాలకీ ఆంతర నిర్మాణానికీ ప్రాపంచిక దృక్పథం విడిగా ఉంటే కవిత వికలమైపోతుంది. విప్లవ కవిత్వానికి విప్లవ సిద్ధాంతానికి అవయవి సంబంధం ఉంటుంది.

మార్క్స్, ఎంగెల్స్ కమ్యూనిస్టు మానిఫెస్టో చదివితే చాలు, విప్లవ కవిత్వం చదవాల్సిన అవసరంలేదు అని ఒక ప్రముఖ బూర్జువా విమర్శకుడు అన్నాడు. అంటే విప్లవ కవిత్వం మూస కవిత్వమని ఆయన అభిప్రాయం. కానీ ఆ మధ్య 'విప్లవ కవితా సంకలనం' మార్చడానికి వందలాది విప్లవ కవితలు చదివాను. నాకు శక్తి ఉన్నంతవరకూ లోతుగానే అధ్యయనం చేశాను. చదివిన ప్రతి

కవితని విశ్లేషించి నోట్సుకూడా రాసాను. అప్పుడు అర్థమైంది, ఆ బూర్జువా విమర్శకుని అభిప్రాయం మోసపూరితమనీ, కల్మష దూషితమనీ, విప్లవ కవిత్వ వ్యతిరేక విషం అనీ, ఉద్యమ కవిత్వంలో దృక్పథ సారూప్యం వల్ల కొన్ని పోలికలు స్పష్టంగానే ఉంటాయి. అంతేకాదు ఒక యుగంలో కవుల కవిత్వంలో కూడా ఆ యుగ ముద్ర అందరిలోనూ ఉంటుంది. ఎవడి అస్తిత్వం వాడిది అని వాదించే అస్తిత్వవాద కవుల్లోనూ సామాన్య లక్షణాలు ఉన్నాయి. వీటిని బట్టి మూస కవిత్వమని ఎవరైనా అనగలరా? కవి తనకు పూర్వమున్న కవుల్తోనూ తనకు సమకాలికమైన కవుల్తోనూ ఏ పోలికలూ లేకుండా రాయగలడా? కాకపోతే మన తెలుగు కవులకి కొందరికి పాశ్చాత్య కవుల్తో పోలికలు ఉంటాయి, భావచౌర్యంవల్ల-

విప్లవ కవిత్వంలో అనంతమైన వైవిధ్యం ఉంది. పదచిత్రాల్లోకానీ, భావాల్లో కానీ, వాస్తవికతని ప్రతిఫలించడంలోకానీ, పదప్రయోగంలోకానీ ఏ ఉద్యమంలోనూ లేని వైవిధ్యం విప్లవ కవుల్లో ఉంది. ఒకే వస్తువుని తీసుకొని ఎక్కువ మంది రాసింది చాలా తక్కువ. అప్పుడు కూడా ఎవరివైఖరి వాళ్ళదే, ఎవరి ప్రతిపాదనా మార్గం వాళ్ళదే. చారుమజుందార్ మీద వివిధ కవులు రాసిన కవితల్ని పరిశీలించండి. ఇంద్రవెల్లి సంఘటన మీద, మండేలా మీద రాసిన కవితలు చూడండి. ఎంతో వైవిధ్యం కనిపిస్తుంది. కవిత్వంలో వస్తువు అంటే అర్థం ఏమిటి? ఇంద్రవెల్లి కవిత్వంలో వస్తువుకాదు. ఇంద్రవెల్లి కవిత్వంలో కవి తీసుకున్న వైఖరి, ఇంద్రవెల్లిలో అతను గ్రహించిన భాగం, దానికి అతడు ఇచ్చిన పదచిత్రరూపం, దాని ద్వారా అతడు పాఠకులకు ఇచ్చిన సందేశం, కవిత అంతర్నిర్మాణం, అది ఒదిగిన పద్ధతి వస్తువు. కవిత్వం వాస్తవికతని పునస్సృష్టిస్తుంది. కాబట్టి ఒకే వస్తువును తీసుకున్న కవులందరూ మూస కవులనడం అర్థరహితం. కవి మనస్సు ఏమన్నా గొట్టమా? ఇటు నీళ్ళు పోస్తే అటు వచ్చేయడానికి? కవి మనస్సులో భావాలు ఉన్నాయి, ఆవేదన ఉంది. అనుభవాన్ని పునరనుసంధానం చేసుకొనే శక్తి ఉంది. జీవితానుభవం ఉంది. భాషా సామగ్రి ఉంది. కాబట్టి ఆత్మీయతా ముద్ర లేకుండా ఏ కవితా ఉండదు. కాబట్టి విప్లవ కవుల్లో వస్తువు ఒకటే అయినప్పుడు కూడా స్పష్టమైన వైవిధ్యం ఉంది. వాస్తవికతకి సంబంధించిన భావనని (Concept) కవిత్వంలో వస్తువు అంటారు. విప్లవకవుల్లో ఎవరికి వారే విప్లవ వాస్తవికతని భావనీకరించుకున్నారు. అంతకు ముందే రూపొందిన భావనల్ని, భావాల్ని చెప్పిన

రీతిలోనే చెప్పే కవులు ఏ ఉద్యమంలో అయినా ఉంటారు. ఉద్యమేతర కవుల్లోనూ ఉంటారు. ఇలాంటి కవుల్ని ఎవరూ పట్టించుకోవలసిన పనిలేదు. పట్టించుకున్నా చేసేది ఏమీలేదు. వాస్తవికతని అగాధంగానూ, నిజాయితీతోనూ ప్రతిబింబించుకోవడానికి కవి స్వతంత్రంగా అన్వేషిస్తాడు. ఆ వాస్తవికతలోని నూతన అంశాలనూ, దాని చలనాన్ని సొంత గొంతుతో చిత్రిస్తాడు. పరిణత విప్లవ కవులు ఇదే చేశారు. రూపంలో నవ్యతని సాధించారు. వస్తువులో వాస్తవికతని ఆవిష్కరించారు. మాట్లాడే భాషలో వచన కవిత్వం రాయడం కష్టసాధ్యమైనపని. అసలు సాధ్యం కూడా కాదనుకుంటాను. అట్లా అని అప్రసిద్ధ పదాలూ పదకల్పనలూ చేయడం కవిత్వాన్ని మార్మికం చేస్తుంది. విప్లవ కవుల్లో భాష ద్వారా వ్యంగ్యార్థాలని చాలమంది సాధించారు. అయత్నకృత వ్యక్తీకరణ, సారళ్యం విప్లవ కవిత్వంలో కనిపించే గుణం.

విప్లవ కవులు వచన కవిత్వంతోబాటు అంతకంటే ఎక్కువగానే పాటలు రాసారు. విప్లవ కవులు తప్ప ఈ రెండు దశాబ్దాల్లోనూ శక్తివంతమైన పాటలు ఎవరూ రాయలేదు. వ్యవసాయిక విప్లవ భావజాలాన్ని వచన కవిత్వంలో కంటే పాటద్వారానే బలంగా చెప్పవచ్చు. గిరిజన, రైతాంగ పోరాటాలనూ, వాళ్ళ జీవితాలనూ వచనకవిత్వంలో చెప్పడం సాధ్యమే కాదు. వచన కవిత్వం ప్రజాప్రక్రియ కాదు. అది పరాయీకరణ ఫలితమైన కవిత్వ రూపం. వస్తుపరంగా దానికి ప్రజా స్వభావం కలిగించగలమేకానీ రూపపరంగా దానికి ప్రజా స్వభావం లేదు. గ్రామంలో, తండాలలో, అరణ్యవాసులలోకి వచన కవిత అతిథిగా కూడా పనికిరాదు. పాట ప్రజల సాంస్కృతికి ప్రాణం. పాట మరణంలేని చిరంజీవి. పాట శ్రమ క్రమ సంగీతం. అపారమైన జానపద సంస్కృతికి పాటకోశాగారం. పాలకవర్గ సంస్కృతికి ప్రత్యామ్నాయంగా సమాంతరంగా ప్రజలు నిర్మించుకున్న సంస్కృతికి పాట పరిమళం. ప్రజల సుఖదుఃఖాలనూ ఆవేశ ఉద్వేగాలనూ జ్ఞాపకాలనూ వ్యక్తం చేసే సాధనం పాట. ప్రజా పోరాటాలు విజృంభించినప్పుడు పాట ప్రజా యుద్ధనినాదంగా ఆయుధంగా ప్రభంజిస్తుంది. శ్రీకాకుళ పోరాటం నుంచీ నేటివరకూ విప్లవ కవులు ఎన్నో పోరాట పాటలు కట్టారు. విప్లవ సిద్ధాంతం, విప్లవ పోరాటాల నిబద్ధతకీ సంబంధించినంతవరకూ విప్లవ వచన కవితకీ విప్లవ పాటకి ఏమీ తేడాలేదు. కానీ వాటిని చెప్పడంలో పోలికే లేదు. పాటలో పదచిత్రాలు ముఖ్యంకాదు. భావాలే

ముఖ్యం. జానపదబాణీ విప్లవ భావాలూ ముఖ్యం. పాడేది పాట కాబట్టి పద చిత్రాలు ఎక్కువైతే ఆవేశం తగ్గుతుంది. అస్పష్టతకీ, సంకీర్ణతకీ పాటలో అవ అవకాశమే లేదు. ఒక సమస్యని తీసుకొని దానిని సమర్థించే అనేక ఉదాహరణలతో పాట కొనసాగుతుంది. దొంతరలు దొంతరులుగా పాట విచ్చుకుంటూ పోతుంది. పాటని ప్రజల భాషలో చెప్పవచ్చు.

విప్లవకవులు రాసిన పాటల్లో అనంతమైన వైవిధ్యం ఉంది. పాటని ఒక ఆయుధంగా ప్రయోగించారు. పాట శ్రోతల్ని పరవశింపచేసే ఆవేశంతో ఊగిపోయే టట్టు చేస్తుంది. పండితులైనా సరే పాట వినేటప్పుడు పామరులైపోతారు. పాటకు లొంగని మనిషి లేడు. పాట ప్రజల్ని రెచ్చగొడుతుంది. విప్లవ పాట అనేకమంది శ్రోతల్ని ప్రభుత్వానికి వ్యతిరేకంగా 'రెచ్చగొట్టింది' పాటతో చైతన్యం పొంది విప్లవ పోరాటాల్లోకి ఆవేశితులైన వాళ్ళూ ఆకర్షితులైనవాళ్ళూ ఉన్నారు. పాటల్లో వాస్తవికమైనవీ, వాస్తవికత కాల్పనికతా కలిసినవీ ఉన్నాయి. హేతువుకన్నా అను భూతికే, వాదంకన్నా అనుభవానికే ప్రాధాన్యం ఇవ్వడం కాల్పనికత. వచన కవిత ద్వారా విప్లవ ఆలోచనలూ విప్లవానుభూతీ వ్యక్తం చేయగలిగితే, పాట ద్వారా విప్లవ ఆవేశాన్నీ విప్లవ అనుభవాన్నీ వ్యక్తం చేయవచ్చును. గడిచిన రెండు దశాబ్దాల్లో విప్లవకవుల పాట మొత్తం సాహిత్య రంగాన్ని ఆక్రమించుకున్న సందర్భాలు చాలా ఉన్నాయి. విప్లవ కవిత్వం ఒక ఉద్యమం కావడానికి ప్రజా ఉద్యమమే, ప్రజల విప్లవ పోరాటాలే వెన్నెముక అయినా దాని వేగానికి పాట ఎంతో దోహదం చేసింది. సిద్ధాంత అంతర్లీనతతో జీవకాంతి నిర్భరమైన పాటలూ ఉన్నాయి. రాజకీయ విప్లవ భావాలనూ, రాజకీయ చర్చలనూ సూటిగా ప్రచారం చేసిన పాటాలూ ఉన్నాయి. పాటలో ప్రచారం కళాత్మకతా కలిసే ఉంటాయి.

పారడీ, సెటైర్, యక్షగానం, బాలేవంటి కళాప్రక్రియల్ని కూడా విప్లవ కవులు రాసారు కానీ సంఖ్యలో చాలా తక్కువ. వీటిని ఇంకా బాగా ఉపయోగించుకోవలసి ఉంది. విశ్లేషణాత్మక అనుకరణతో బలమైన పారడీలు ఒకటి రెండు వచ్చినా ఇది విమర్శకి, అవహేళనతో కూడిన విమర్శకి బలమైన కవితా రూపంగా వాడుకోవచ్చునని నిరూపించాయి. ప్రఖ్యాత ఆధునిక ధోరణులే కాకుండా ఇటీవల నూతన వాస్తవికతని (యువ) కవులు సృష్టిస్తున్నారని కొంతమంది కవులూ, విమర్శకులూ అంటున్నారు. 1980 తర్వాత ఇలాంటి ధోరణి ఒకటి కవిత్వంలో

బయలుదేరిందని ప్రచారం చేస్తున్నారు. ముఖ్యంగా విప్లవ కవిత్వ వ్యతిరేకులే ఈ ప్రచారం చేస్తున్నారు. కొంతమంది ఇలాంటి కవులు ఉన్నమాట నిజమే. వీళ్ళల్లో ఎక్కువ మంది ప్రఖ్యాత ఆధునిక ధోరణుల తత్త్వానికి ప్రతిధ్వని కవిత్వమే రాస్తున్నారు. అనుభవంలో అపరిపక్వత, భావాల్లో అరాచకత్వం, శిలువవేసిన పద చిత్రాలూ, సమస్యల వికృత చిత్రణా, వ్యక్తి కేంద్రీకృతత్వం, ఈ కవిత్వ లక్షణాలు. ముఖ్యంగా నిబద్ధతా భావనకి వీళ్ళు వ్యతిరేకులు. వాళ్ళల్లో కమ్యూనిస్టు వ్యతిరేకులూ ఉన్నారు. మాటల్లో అనుకూలురూ ఉన్నారు. ఈ కవులు సృష్టిస్తున్న నూతన వాస్తవికత ఏమీలేదు. సామాజిక వాస్తవికత నిరంతరం మారుతుంటుంది. అలా మారుతున్న వాస్తవికతను కాదు వీళ్ళు చెపుతున్నది. కవులు వాస్తవికతని ప్రతిబింబించరు. వస్తుగత వాస్తవికతకి సంబంధంలేని వాస్తవికతని సృష్టిస్తారు. అది మానసికం. ఇదీ వీళ్ళు చెప్పే నూతన వాస్తవికత. ఇది అశాస్త్రీయమైన, భ్రమాజనితమైన అభిప్రాయం. వాస్తవికత మనస్సులో పుట్టదు. జీవితంలోనే పుడుతుంది. జీవితంలోని ఏ విలువైన నూతన వాస్తవికతని ఈ కవులు చిత్రించలేదు. ఇందులో నూతనత్వమూ లేదు. ఇది ఒక ప్రత్యేక ధోరణి కాదు. బూర్జువా ఆధునికతలో ఒక బలహీనమైన భాగమే. ఇదే ఇటీవల 'కవిత్వవాదంగా' ప్రచారంలోకి వచ్చింది.

విప్లవ కవిత్వం ప్రబలశక్తిగా విజృంభించడంతో కృత్రిమ విప్లవకవులూ, ఔత్సాహిక విప్లవకవులూ పుట్టుకువచ్చారు. కృత్రిమ విప్లవ కవులకు విప్లవాన్ని గురించీ, విప్లవ సిద్ధాంతం గురించీ ఏమీ తెలియదు. అచారిత్రకంగా, అయోమయంగా ప్రాథమిక అన్వయశక్తి లేకుండా, సందర్భశుద్ధి లేకుండా అమాయకుల్ని హడలకొట్టే పాండిత్యం ప్రదర్శిస్తారు. సంస్కృత అలంకార శాస్త్రాల్లోని శ్లోకాలనూ లెనిన్ వాక్యాలనూ ఉల్లేఖించి ఒక సిద్దాంతం చేస్తారు. వాళ్ళకి ఆ రెండూ తెలుసుకానీ రెండింటికీ అర్థాలు తెలియవు. ఏ నిర్దిష్ట వాస్తవికతని ఉద్దేశించకుండా విప్లవం నొక ఆడంబరం చేస్తారు. నా దేశం నా ప్రజలు అని చిందులు వేస్తారు. దేశం వాస్తవమైన దేశంకాదు, ప్రజలూ వాస్తవ ప్రజలు కారు. ఊహల్లో దేశంలో ఊహల్లో ప్రజల గురించి, ఊహల్లో విప్లవం గురించి రాస్తారు. పాశ్చాత్య సాహిత్య పాండిత్యం, మార్క్సిజం పాండిత్యం అనే తృణ కవచాల్ని ధరించిన పీరవిదూషకులు. వీళ్ళ నిజసార స్వరూపం ప్యూడలిజం. ఔత్సాహిక విప్లవ కవులకి విప్లవంపట్లా, విప్లవ

కవిత్వంపట్లా ఉత్సాహం ఉంటుంది. శ్రద్ధ ఉండదు. సిద్ధాంత అధ్యయనంలో, జీవిత పరిశీలనలో ప్రాథమిక ప్రయత్నంకూడా చేయరు. విప్లవాన్నీ, విప్లవకారుల్నీ పొగుడుతుంటారు. సిద్ధాంత నేపథ్యంలేకుండా ఘటనల్ని కవితలో ఛాయాచిత్రం చేస్తారు. కవితలో విప్లవ అనుకూలభావాలూ, విప్లవ వ్యతిరేకభావాలూ అనుద్దిష్టంగా కలిపేస్తారు. కవిత్వం చదివి కవిత్వం రాస్తారు. పువ్వునుంచీ పువ్వు పుట్టదని వీళ్ళకు తెలియదు. కవికి మహాపాండిత్యం అవసరం లేదు కానీ దేన్ని గురించి రాస్తు న్నామో దాన్ని గురించి తెలియాలి. విప్లవకవులు కృత్రిమ విప్లవ కవుల్తో పోరా డాలి. ఔత్సాహిక విప్లవ కవుల్ని పరిపక్వం చెయ్యాలి.

ఈ రెండు దశాబ్దాల్లో ప్రత్యేకంగా ఈ దశాబ్దంలో బుద్బుద కవులు కొందరు ఉన్నారు. ఇరవ్వొకటో శతాబ్దికవులూ, నిరసన కవులూ, కవిసేన కవులూ, మినీ కవులూ, నిశితకవులూ, అకవులూ అధివాస్తవికుల ప్రవేశకవులూ, విపశ్యనకవులూ బుద్బుదకవులు. వీళ్ళకి వేపకాయకాదు, తాటికాయంత వెర్రి ఉన్నట్టు ఉంది. పది మంది కవులు ఏదోఒక పేరు పెట్టుకొనివాస్తే అది ఒక ఉద్యమం అవుతుందను కుంటున్నారా? ఒక ధోరణి అవుతుంది అనుకుంటున్నారా ? సాహిత్యంలో ఉద్యమాలు సామాజిక ఉద్యమాలనుంచీ వస్తాయి. సమాజంలో ఒక పెద్ద మార్పు జరుగుతున్న ప్పుడు దాని ప్రభావంతో సాహిత్యంలో ఉద్యమాలూ, ధోరణులూ వస్తాయి. ప్రపంచ ఆలోచనాపరుల్ని కదిలించే ఒక తాత్త్విక సిద్ధాంతం ప్రభావంతోకూడా కవిత్వంలో కొత్త ధోరణులు వస్తాయి. ఈ బుద్బుదకవులకు ఇలాంటి ఏ పునాదీ లేదు. అలాంటప్పుడు ఇలాంటి 'జిమ్మిక్స్'తో ఏమి సాధించదలచుకున్నారు ? కవి త్వం పక్కన 'మినీ' అనే మాట కవులకైనా అసహ్యమనిపించటం లేదా ? పైగా దానిమీద హేతుబద్ధంకాని పనికిమాలిన సిద్ధాంతాలుకూడానా ? లాక్షణికుల వేషం వెయ్యడంకూడానా ? చిన్నదా పెద్దదా అనేది సాహిత్యచర్చలో భాగమేకాదు. ఈ నానారకాల పేర్లతో వస్తున్న కవిత్వంలో ప్రగతిశీల కవిత్వం రాస్తున్నవాళ్ళు లేక పోలేదు. వాళ్ళ విప్లవ కవిత ఉద్యమంలో మమేకం కావడం అవసరం.

ఈ రెండు దశాబ్దాల్లో స్త్రీ విముక్తి కవిత్వం, దళిత కవిత్వం కూడా వచ్చాయి. ఈ కవిత్వాలకి బలమైన సామాజిక పునాది ఉంది. దోపిడీ అనేది ఆర్థికంగానేకాదు రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రూపాల్లో అత్యంత క్రూరంగా వుంటుంది. ఆర్థికమైన దోపిడీ ఎన్నో రూపాల్ని తీసుకుంటుంది. ఈ అన్ని రూపాల దోపిడీ

లకు గురవుతున్నవాళ్ళు స్త్రీలు, దళితులూ. రాజ్యాధికారం నుంచి దోపిడీ పక్షాలు మారినా వీళ్ళమీద దోపిడీ ఇంకా ఎక్కువే అవుతోంది. ఇది శతాబ్దాల తరబడి జరుగుతున్నది. వీళ్ళ కవిత్వంలో ధార్మిక ఆగ్రహం, తీవ్రనిరసన, తిరుగుబాటు భావాలూ కనిపిస్తున్నాయి. కానీ ఈ కవిత్వంలోని తాత్విక దృక్పథంలో అన్ని వర్గ భావాలు చోటుచేసుకుంటున్నాయి. కమ్యూనిస్టులు వీళ్ళకు నమ్మదగ్గ మిత్రులుగా నిరూపించుకొని, వాళ్ళ సమస్యల్ని పరిష్కరించే కొత్త ఎత్తుగడల ద్వారా విప్లవ చైతన్యం తీసుకురావాలి. ఇప్పటికే విప్లవ కవులు మార్క్సిస్టు సిద్ధాంతం వెలుగులో, పోరాటాల బాటలో స్త్రీ విముక్తి కవిత్వం, దళిత కవిత్వం రాసారు. ఈ దారిలో ఇంకా విప్లవ కవిత్వాన్ని అభివృద్ధి చెయ్యాలి.

రష్యా, చైనా పరిణామాలూ, తూర్పు యూరపు దేశాల్లోని సోషలిస్టు ప్రభుత్వ పతనాలూ చాలా మందిని గందరగోళంలో పడేస్తున్నాయి. కమ్యూనిజం పని అయిపోయిందని బూర్జువా వర్గాలు చంకలు గుద్దుకుంటున్నాయి. 1970 లోనే విప్లవ రచయితల సంఘం రష్యా రివిజనిజం కారణంగా సోషల్ సామ్రాజ్యవాద దేశంగా మారిపోయిందనీ ప్రపంచ ప్రజలకి అది ప్రధాన శత్రువనీ ప్రకటించడం జరిగింది. రష్యా శిబిరంలో ఉన్న దేశాలు సోషలిస్టు దేశాలు కావనీ స్పష్టంగా చెప్పారు. చైనా రివిజనిస్టు పంథాలో పడిపోయిందనీ 1980లో వివరించారు. రివిజనిజం అంటే బూర్జువా వ్యవస్థ అనే అర్థం. విప్లవ రచయితలు చెప్పిందే వాస్తవమని రుజువైంది. గోర్బచెవ్ ఇవ్వాళ ప్రపంచ విప్లవ విద్రోహ మహా నాయకుడు (సి.ఐ.ఎ. ఏజెంట్ అని కూడా కొందరు అనుమానిస్తున్నారు.) పెరిస్త్రాయికా, గ్లాస్‌నాస్తలు రివిజనిస్టు విషానికి కొత్తపేర్లు. రివిజనిజానికి వ్యతిరేకంగా పోరాటం చెయ్యడం విప్లవకారుల మహత్తర కర్తవ్యం. మావో తన జీవిత కాలంలో రివిజనిజానికి వ్యతిరేకంగా మహోధృత పోరాటంచేశాడు. బూర్జువా పత్రికలు రుమేనియానియంత సొసెస్కూని స్టాలిన్‌తో పోలుస్తున్నారు. ఇంతకంటే రాజకీయ మహాపచారం, దుర్మార్గం మరొకటి లేదు. స్టాలిన్, మావోల బాటను విడిచిపెట్టడం వల్లనే ప్రపంచంలో రివిజనిజం విలయతాండవం చేస్తోంది. 1966 లో ప్రసిద్ధమైన 8 డాక్యుమెంట్లలోనే చారు మజుందార్ "రివిజనిజాన్ని ప్రతిఘటించండి, రైతాంగపోరాటాన్ని ఉధృతంచెయ్యండి" అని భారతప్రజలకు పిలుపు ఇచ్చాడు. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావోల మూల రచనలను అధ్యయనం చేసి, వర్తమాన పరిస్థితులకు అన్వయం చేస్తూ

కథ :

## ఖండన

సువర్ణముఖి

పొద్దుపూరనేదు తొలికోడైనా కుయ్యనేదు ముఖలింగం చింతపండు కావిడి తోటి పట్నంకాసి బయిదెల్లాడు. ఊరు దాటి ఉయ్యాకోడిపోడు అంచులెల్లి నడుస్తుంటే వొంట్లో వణుకు పుడతంది.

ఏ ఆపీసర్ బావ్ కంటల బడిపోతనేటోనని.

ముఖలింగం నడకతోటి సమానంగా ఉట్టెలు కూడా వణుకుతున్నట్టు ఊగుతున్నాయ్—

ఏ ఆపీసు మూలపడిపోయి మా బతుకులు ఏ సెదపురుగులు కొట్టెత్తవో నన్న బయంతోటి గావాల.

చింతపండు మీద మంచు పడతంది. మంచు బాగా పడితే - "తడిపేసి దెంకొచ్చినావేటిరా" అని రేటు తగ్గించేత్తరు. అందుకే ఆ పక్కనున్న చింత గున్న దగ్గర కావిడి దింపేసి అడ్డాకులు తెంపికొచ్చి మీదేసినాడు. ఏలాగ దించినాను గదా- అని చుట్ట ముట్టించినాడు.

చుట్టూ చీకటిగుంది. మొక్కా చెట్టూ కనబడకుండా అంతా చీకట్ల కలిసిపోయింది. కొండలన్ని ఏనుగులు తొంగున్నట్టుగ కనబడతన్నయ్. ఎదురుగున్న బోడికొండ సిగిలిం మీద మాత్రం ఈరగొట్టాపు (వీరఘట్టం) సాపుకారి పట్టబుర్ర మీద నిక్కబొడిసి కూకున్న నాలుగు పుంజీల ఎంట్రుకల్లాగే కనబడుతున్నయ్ ఆ కొండమీదున్న రెండు చెట్లోవో.

---

సైద్ధాంతిక పోరాటం చేయవలసిన బాధ్యత విప్లవ రచయితలమీద ఉంది. ప్రజలకీ, ప్రజాపోరాటాలకీ, మార్క్సిజం లెనినిజం, మావో ఆలోచనా విధానానికి నిబద్ధమై పోరాటం చేసినంత కాలం విప్లవ రచయితల సంఘం అజేయంగా పురోగమిస్తుంది. 1970-80 దశాబ్దాన్ని విరసం దశాబ్దం అన్నారు. 1980-90 దశాబ్దం కూడా నిస్సందేహంగా విరసం దశాబ్దమే.

"అతనిది యుద్ధ వ్యాకరణం!
ఫిరంగి భాష"

అక్కడకాసె బయిదెల్లి అగాటీ మీదకెల్లేసరికి పల్లపు గ్రామాల లైట్లన్నీ వెలిగి చెరువులోని తామర పువ్వుల్లాగ కనబడతన్నయ్. అట్నా చూస్సరికి పులినోటి లోకి పెలుతున్నట్లుగ అనిపించి మరింత బయమేసింది.

అగాటీ దిగీసరికి బలబల తెల్లారతంది. అడవి గూడా తెరిపిచ్చింది. గబగబా నాలుగడుగులేసి రోడ్డు పాయింట్ కి చేరుకున్నాడు.

అప్పుడికే టిటుకుపాయి సవర్లు ఇద్దరు బస్సుకోసం కాత్తన్నరు.

"ఎ్వక్కడికివోయ్" అడిగినాడు మొఖలింగం.

"ఉ.... పి. వోగాడి దగ్గిరిక్కి" అని ఒకడంటే

"హ్వారు మాసాలబట్టే.... ఇలగ్గే తిరగతన్నమ్....ఒక నోసూ నేదూ....గీసూ నేదూ వ్వళ్లు పుల్లయ్‌పోతందీ....ఇల్లు గుల్లయ్ పోతందీ" అలాగ మాట్లాడి అటు చూసాడు. గెద్దొచ్చి కోడిపిల్ల నెత్తికెలి పోయినట్టగ "జయ్యీ"మని జీపి వచ్చి బుర్రు మని ఇటుకోసి, కేసొంపుగ అటుకోసి, వచ్చిన కాసే తిప్పి ఆపాడు ఆ జీపి. అపీసరికి టపీమని ముందుకాసి అపీసర్ గెంతినాడు.

రైడ్ పార్టీవోల్లాగ గుమాస్తాలు గెంతినారు. వచ్చీరావడమే-

"ఎవుడిరా! ఈ చింత పిక్క ఎవుడిదేస్" అనీసి ఎర్రగించి ఒక చూపు చూసి

"మ్మయమ్మ....ఎందిరా ఎపుడూ నోరు మెదపడు. ఎపుడిదీ కాదేటిరా" అరి చాడు అపీసర్.

అపీసరు అరిచీసరికి పలక్కపోతే పట్టికెలి పోతదేటోనని-

"నాదీబ్బావ్....తిండిపండు బావ్" గుటకలు మింగాడు మొఖలింగం.

"ఏటేటిరా! తిండిపండా!.... ఏటి నీ పెల్లం నువ్వు పట్నమ్లో కాపరమెట్టినా రేటిరా.... వెదవ కబుర్లాడకు.... చింతపండు జీపులేసి, నువ్వు జీపెక్కురా" జీపెక్కకపోతే తంతానన్నట్లు చూసాడు అపీసర్.

"బావ్వ్....తిండిపండేనిబ్బావ్"

"అప్నరా రంకునేర్సినదాయి....బొంకు నేర్సక మా న్తాదా ?"

"బావ్....స్సెమించండి బావ్....నానే రోడ్డోరపీ గట్రా యేరనేదు బావ్. నా కొండ మీదవి బావ్."

"అమ్మనీయ్యమ్మన్నీ తెలివితేటలా....కొండ, మీయ్యమ్మదే మీబావ్‌దిరా.... నంజాకొడ్క.... కొండ గవ్రమెంటుదిరా. కొండమీద గంటి గింజ వేసు

కున్నంతమాత్రాన కొండ నీదై పోయిందేటిరా" అనీసి గిర్రున గుమాస్తాలకాసి తిరిగి- "ఏయ్.... ఇది ఎక్కించండివోయ్" అని అరిచి, సిగిరెట్టు తీసి ముట్టిస్తూ......
"గవ్రమెంటు మీకు నెత్తికెక్కించుకుంతందిరా.... ఇక్కడ మీకేటో రచ్చిద్దుమని కార్పొరేషన్లూ....గీర్పొరేషన్లూ, ఎట్టి మాకు దెచ్చి, ఈ అడివిల దించితే మీయ్యమ్మ మీరేమో దొడ్డిదార్ని దెంకెలి పోతన్నర్రా" గిర్రున అటు తిరిగి "ఎక్కించండి వోయ్....చూ త్తారేటింకా!" అని గుమాస్తాల కాసి అరిచాడు.

"బావ్ మా గుంటముండ పాపకి పెళ్లి బావ్.... ఒక్కావల డబ్బులు ఎక్కువొత్తే దనికోక నంగా ముక్క కొనొచ్చునని ఇల్గ దించినాన్ బావ్.... నాను పిల్లప్పుడు కాసి ఎప్పుడూ ఇలాపింటి పని చెయ్యనేదు బావ్" అనీసి ఏడుసుకోని చింత పండు గంపలకి ఏలబడిపోనాడు.

"ఆహ్హా.... పావల్డబ్బులు ఎక్కువొత్తాయని కిందకి దించినావా....అలగయితే మరేల్రా బియ్యపు గింజలు కిందనే గొనుకోరా....ఉహూ....అలగ మళ్లీ చెయ్యక్రా.... నావి పాతిక్కేజీలు....నావి పదేనుక్కేజీలు అని దెబ్బవాడి దెబ్బుతార్రా....అప్పుడు మీకు కార్పొరేషన్ గావాలిరా....తెలివితేటలా ఎక్కువై పోనయిరా మీకు ...అంత ఎక్కువుంతే వంటికి పెమాదమురోయ్....పార్తుపురం (పార్వతీపురం) పాయిదాకిచ్చియర్రా....ఇంకా ఎక్కువై తే ఈరగొట్టాం వడ్డీకిచ్చీయర్రా"

"బావ్వ్వ్.... మీరు దేవుడినాటోలు బావ్వ.... తెలీక సెస్సీనాన్ బావ్.... బావ్ నా కూతురి పెళ్లి మీరే చేసినట్టు గుంతాది బావ్.... వదిలీయండిబావ్" అని ఆపీసరు కాళ్లకి చుట్టుకొని మొఖలింగం ఏడుత్తుంటే మందవోన ఆవుని పులినోట కరిసి త్తే మిగతా ఆవులు తుప్పలు చాటు కంచి చూసినట్టగ టిటుకుపాయి సవర్లు చూసుకోని ఆలగే వుండిపోర్ను.

కాళ్ళు పట్టుకున్న మొఖలింగాన్ని బూటుకాలుతోటి తన్నీసాడు ఆపీసరుబావు చింతపండు జీపెక్కించుకోని జీపు మాయమైపోయింది.

జీపు కనబడి నంతవరకూ వెనకే పరిగెడుతూ "బావూ వదిలీయండి బావూ.... బావ్ రచ్చించండి బావ్....బావ్ నా కూతురిపెళ్లి ఆగిపోద్ది బావ్...." అంటూ అరుస్తూ కారెనకే పరిగెట్టాడు.

పిల్లని ఎత్తుకుపోయిన గెద్ద వెనక తల్లి కోడిలాగే అరిచాడు.

చేసేంది లేక దోసుబాయి ఆపీసుకు ఐయిదెల్లినాడు....ఎటవుద్దో.... నా చింత పండు ఎటవుద్దో.... కూతురి పెళ్లి ఎటవుద్దో అని ఆతృతతోటి నడక సాగించాడు.

గంజీ గడుగూ లేకుండా—

o o o

వళ్లు చీరుకున్నా కనబడనంత చీకటి గడ్డిపిట్ట లెక్కటో కిచుకిచు వాడతన్నయి. దారికింద పెల్లి గెట్టి గలగల రాళ్ల మీద నుంచి పారతంది.

నెమ్మదిగా అడుగు లేసుకొని పూరుకాసి నడుస్తున్నాడు ముఖలింగం. పూరి మద్దిన దీపమేదో ఎలుగుతంది. ఆ దీపాన్ని చూసాడుగాని ఆ ధ్యాసలోనే లేడు కళ్ళ ముందే కదులుతన్నయ్ ఆపీసర్ల బావుల తిట్లు. తుమ్మిక మొజ్జులాగ వున్న ఆపీసర్ బావ్ అయితే-

"ఆయన గాబట్టి వండు దీసుకొనే వదిలీసినాడు నానైతే పళ్లిరగ దొడిసి దొక్కల తోసిద్దును" అవన్నీ గుర్తుకొచ్చి ఇంకా ఆపీసు దగ్గిరున్నట్టే నడుస్తుంటే

"ఎవరూ" ఎవులో కొత్తోలే గంభీరంగా అడిగారు.

ముఖలింగం వళ్లు జల్ల దొడిసింది. నా పూరుకాడ నాకెవులు అడుగుతన్రని కాదు తనని పట్టుకోడానికి పోలీసులు గట్రా వచ్చారేటోనని. అయినా అయినంత య్యింది ఇంకా ఏటుంది అనుకున్నాడు.

"న్నీను బావ్" అన్నాడు.

"నువ్వంటే"

"ముఖలింగడ్ని బావ్"

"ఏ పూరు"

"ఈ గూడేనిబావ్" అంటూ దగ్గరగా వచ్చి దిగాన కాసి ఎగాన వరకూ చూసి వసిలబోయి పక్కకెల్లి ఎల్లిపోతన్నాడు ముఖలింగం.

"అన్నా నన్ను ఎవరనుకుంటున్నావన్నా" అన్నాడు అతడు.

"నాకెందుకు బావ్ ఏటీని అనుకోడం నా దారినాదీ" అన్నాడు.

"మనం క్రామేడ్లమన్న. పూర్లోన మీటింగు అవుతుంది యెళ్ల." అన్నాడు అన్నాయన సెంట్రీకి నిలుచున్న దివాకర్.

చింతపండు పోయిన సంగతి మర్చిలేకపోనాడు. అయినా ఆ బాధ దిగమింగు కోని మీటింగు చూడాలని నాలుగడుగులు ఎక్కువేసాడు.

కాంమ్రేడ్లు ఇటు కూకోని అటు మొఖం బెట్టారు. గూడోలు అటు కూకోని ఇటు మొఖం బెట్టారు. ఆలకీ ఈలకీ మధ్దిన దీపం గాలికి రెపరెప లాడతంది. మొఖలింగం కూతురు ముందరే కూకుంది. మతిమడపాలు మీద-దృష్టి దీపాలమీద అన్నట్లు మీటింగుల కూకుందే గాని అయ్య ఎప్పుడొత్తాడా అని అటుకాసే చూత్తంది.

అయ్య కనబడ్డంతోటి గబుక్కున నెగిసిపోయి అయ్యకెదురెల్లి సంచి నాక్కుంది. సంచిల చెయ్యెట్టి చూసింది ఏటీలేదు. అయ్య మొఖం చూసింది. ఆ చూపులో నాకు "నంగా తెత్తానన్నావేది" అన్నట్లనిపించింది మొఖలింగంకి. కూతురు మొఖం సూస్సరికి ఏడుపొచ్చింది. కూతురు బుజమ్మీద చెయ్యేసి ముంజూరు దగ్గిర బుగ్రొంచి ఇంటిల దూరిపోండు.

మీటింగు సాగుతుంది మాటలకి కొండలు ప్రతిధ్వనిస్తున్నాయి.

"....ఆనాడు పిత్త పరిగి ఉప్పుచేప ఇచ్చి మన పల్లం బూమి తీసుకున్నారు. ఉల్లిపాయా ఉప్పుగడ్డ ఇచ్చి మన ఊట బూమి తీసుకున్నారు. ఇది అన్యాయం బావూ.... ఇది అక్రమం బావూ అన్నందుకు మూడువందలయాభై మంది మన సవర జాతపుల్ని చంపారు. ఆణిముత్యాల్లాంటి మన నాయకుల్ని చంపారు. అయితే వాళ్లు ఏ ఆశయం కోసం ప్రాణాలిచ్చారో ఆ ఆశయం ఈవాళ మనముందు వుంచారు. ఆ ఆశయాన్ని కొనసాగించాలా ? వద్దా ?" మీటింగుల మధ్యలో గూడ వాళ్లకి ప్రశ్నేసాడు కమాండర్.

"చెప్పండి! కొనసాగించాలా ? వద్దా ?" అన్నాడు మళ్లీ.

మొఖలింగం అప్పుడే వచ్చి కూకున్నాడు. "అవును నిజమే పోరాటం చెయ్యాలి" లోలోనే అనుకున్నాడు. ఏటి చెప్పాలో వాళ్లకి తెలీలేదు.

దశిమియ్య ఏదో చెప్పాలని తడబడుతూ—

"వ్వద్దూ" అన్నాడు.

తనేటి చెప్పానో వాళ్లకు అర్థమవ్వలేదన్న సంగతి కమాండర్‌కు అర్థమయ్యింది.

"మనోలు కూడు కోసం గుడ్డ కోసం ఉన్నోలితోని పోరాడినారు....ఆ కూడూ గుడ్డా రాకముందే మనోలు చచ్చిపోయ్రు. మనోలిని చంపేసిన గవరమెంటు మీద మన బువ్వకోసం మన బట్టకోసం పోరాటం చెయ్యాలా ? వద్దా? ఇప్పుడు చెప్పండి" అన్నాడు కమాండర్ ఈసారైనా కృతకృత్యుడిని అవుతానా లేదా అన్నట్లు.

"చెయ్యాలి" "చెయ్యాలి" అన్నారు.

మొఖలింగం తన సమస్య కామ్రేడ్లకు చెప్పాలని తొందరపడుతున్నాడు.

"చెయాలంటే దళిమియ్య ఒక్కడు చేత్తే అయిపోద్దా! నాను ఒక్కడ్ని చేత్తే అయిపోద్దా! అన్నాడు కమాండర్.

""""కట్టుగుంతే అవుద్ది కామ్రేడ్"అన్నారెవులో

"ఒక్కలితోటి కాదు కామ్రేడ్" అన్నారెవులో

"మా విషయమేటి ఇంకా మాట్లాడరు" అన్నట్లు చూత్తన్నరు యువకులు ఎవులో నెగిసి ఒకటి కెల్లారు. ఇంకెవరో చుట్ట ముట్టించారు.

"బాగుంది అయితే మనం సంగం పెట్టుకున్నట్టే గదా! దానికి మెంబర్లుగా ఎవులి నెట్టుకుంతం" అన్నాడు కమాండర్.

"మొయింగడ్ని, దళింగాడ్ని ఎట్టండి" అన్నారెవలో

సంగం బెట్టుకున్నారు మొఖలింగం మీటింగు మద్యలోంచి నెగిసి ఇంట్లోకి పరిగెట్టాడు. అందరూ పల్లకే అటే చూసినారు.

సిద్దలోన ఆముదం దివ్వకుద్ది లోనేసి సలచటి గుడ్డ చింపి వొత్తెట్టి మీటింగు మద్దిలోకి తీసికొచ్చారు. ఏటి చేత్తన్నడో అర్థమవ్వనేదు దళ సభ్యులకు. అందరూ ఉత్కంఠతో చూత్తన్నరు.

అగ్గిపుల్ల రంగ దీసి దీప మెలిగించాడు. వెంటనే నిలబడి "వ్రేరే సంగ మెట్టుకున్నట్టగ క్కాదురా! కట్టానికి నట్టానికి మంచికీ చ్చెడుకీ సంగం తోటి ఉంతామని పెమానం చ్చెయ్యండిరా అగిని సాచ్చిగ పెమానం చెయ్యండిరా" అన్నాడు.

వాళ్లలో పట్టుదల కసీ చూసేసరికి దళమంతటికీ వెంపటాపు సత్తిం కనిపించినట్లయింది.

"రండిరా ఎవుడెవుడుంటాడో ప్పెమానం చెయ్యండిరా.... ఒరే నా చింత పండు దొబ్బినార్రా కార్పొరేషనోలు ఏమన్యాయం చేసినామని దొబ్బినార్రా........ ఏమన్యాయం చెయ్యకుండ ఆలిట్ట మొచ్చినట్టగ ఆలు దెబ్బుతుంటే స్వాత్తామేటి చెప్పండిరా" అన్నాడు బాధగా కసిగా మొఖలింగం.

అటు దళానికి ఇటు గూడోలికి అప్పుడే తెలిసింది మొఖలింగం చింతపండు పోయినట్టుగ.

ఏడుపొత్తంది మొఖలింగంకి అయినా అదిమిపట్టి "రండిరా" మళ్ళీ పిలిచాడు.

ఒక ముసలిదాయి నెగిసింది దీపం దగ్గిరికొచ్చింది—

"కామ్రేడ్ నాది మొగుడు సంగంకోసం చచ్చినాడు నాను సవ్వడానికి సిద్ధమై.... ఇష్టపూర్వకంగా....అగిని సాచ్చిగ పెమానం పెమానం చేత్తన్ను....గాని....అడిని చంపాలికామ్రేడ్" అన్నది—

"ఎవురిసి" అన్నట్లు అందరూ నుదురు చిట్లించి చూసారు.

"మేరిది సత్తిమ్‌గాడ్ని కామ్రేడ్....చంపీయ్యాలికామ్రేడ్" అన్నాది

కోరన్నా మంగన్న ఆమెకు కొడుకులు కాదు. కాని కోరన్నా మంగన్న అమరులై ఆ తల్లికి కొడుకులయ్యారు. అందుకే ఆ వర్గకసి ఆమె కళ్ళల్లో చింత నిప్పుల్లా వెలుగుతుంది.

మరెవరో లేచారు దీపం మీద చెయ్యిపెట్టారు....వరుసకట్టారు....గూడ గూడంతా పెమానం చేత్తను.

చుక్కడు మొఖలింగం చింతపండు ఎలాగ తేవాలా? అని ఆలోచిస్తూ గుబుక్కున ఇంటిలోకి దూరి గూనలోకి చెయ్యిబెట్టాడు "కిచు" "కిచు" మని సురి పెలక పారిపోయింది. ముచ్చి సంచిలో నున్న గుడ్డ తీసాడు. అది యివతలికి తీసుకొచ్చి యిప్పాడు.

అది ఎర్రజెండా అనాటిది. చిన్న చిన్న ముక్కలు ఎలుకలు కొట్టేశాయి అది దీపం ముందుకు తీసుకొచ్చి—

"ఓరి మొయిలింగా....హ్హా....అపీసర్ బావ్‌కి ఇదిచూపి మా చింతపిక్క ఇవ్వకపోతే నీ సంగతి మాం చూసుకుంతమ్ అని చెప్పుదం" అన్నాడు.

దళమంతటికీ ఆ పద్ధతి బాగున్నట్లనిపించింది—

పక్కనున్న యువకుల మద్దిన కూకున్న నడి వయసుగాడొకడు నెగిసి "కామ్రేడ్.. ఇందాక నాను చెప్పిన మడిచెక్కల గురించి ఏటి చేస్తమ్‌కామ్రేడ్" అన్నాడు అని తొడమీద పాకురుతున్న సీమను టపీలుమని కొట్టాడు అదీ అలాగే అంటుకుంది.

ఇందాక వచ్చీరావడమే అతడు చెప్పినాడు వూర్లో నాలుగొందల ఎకరాల బూముందని, అది సావుకారిదని—

శ్రీకాకుళ పోరాటంలో బగతలందరూ బూములొదిలి పారిపోనారు అలాగ పారిపోయిన పల్లపురాజు శ్రీరామరాజు మాత్రం పోరాటం ఆగిపోగానే మళ్ళీ

వచ్చాడు—వచ్చీసరికి అందరూ భూమి పంచుకొని చేసుకుంతన్రు—అప్పుడేటి చేసా డంటే అదిచెప్పాడు—ఇదిచెప్పాడు—మిలట్రోలని తెత్తానని చెప్పి, ఆ భూములు అలపేర్నేపుంచి సమచ్చరానికి—ఎకరాకి—నాలుగొందలు లెక్కని ఖండన చేసుకొని గత పాతికేళ్ళగా సొమ్ము తింతండు.

అది ఆ ఖండన విషయమే మాట్లాడమని ఆ యువకుడు అన్నాడు. అందరూ పల్లక ఉూకున్నారు కమాండర్ మొదలెట్టాడు—

"కామ్రేడ్స్ నాడు బోగబంధ, ఖండగుత్తల దోపిడి నుంచి మనల్ని విముక్తి చెయ్యడానికి ఎన్నో త్యాగాలు చేసి ఎందరో బిగతల్ని పంపించారు....కాని వాటి కొనసాగింపుగా సాగుతున్న ఈ ఖండనకి ఇక్కడితో మనం ఆపు చేయాలి." అని మాట్లాడుతూ "ఈ సమచ్చరం ఆడికి డబ్బు కట్టీసారేటి?" అని ప్రశ్నించాడు.

"కట్టనేదుకామ్రే మొన్న గుమస్తా వత్తే ఈ యేడు పంట రానేదూ.... సొమ్ము నేదు తర్వాత కడతాంనే అని చెప్పినాం కామ్రే....ఈ సంతనోపే (సోమా రంనోపే)—స్నావుకారి రావచ్చును కామ్రే" అన్నాడు.

"అయితే ఆడొచ్చిన యెంటనే మేమివ్వమ్ అనిచెప్పి ఆడ్ని పంపించండి" అని చెబుతూ ఎలా చెయ్యాలో చెప్పాడు. చెబుతూ—

"భూములకోసం మీరు బాధపడవద్దు అవసరమైతే బిగతబిర్ర తీసైనా తెద్దుం" అన్నాడు

ఇందాకటి ముసలమ్మ నెగిసింది "కామ్రే బూమువొద్దు కామ్రే....మేరిది సత్తింని చంపండి కామ్రే" అన్నది కొంచం బాధగా....విసుగ్గా....కసిగా.

అపుసు అప్పుడు కోరన్న మంగన్నని చంపిన మేడిదిసత్యం అలా పుంటుండ గానే గవర్నమెంటు గిరిజనులకు అభివృద్ధి అని చెప్పి రోడ్డు వేసింది. కరెంటు బిల్బువేసింది ఇవన్ని ఏసి మరిపించీసి మేడిది సత్యంని కనీసం అరెస్టయినా చెయ్య లేదు సరికదా వాడి రక్షణకు తుపాకులిచ్చింది.

ఈవాళ కామ్రేడ్లు బూములు కోసం పోరాటం చేద్దుం అంటన్రు....ఆపీసర్ల తోటి పోరాటం చేద్దుమంటన్రు....ఇవన్నీ చేసి ఆ సత్తింని సంపడం మరిసిపోతా రేటోనని బియమోతప్ప బూమువొద్దనికాదు—ఆ కల్లల్లో పేణం పుండగానే ఆడి రక్తం చూడాలని అనుకొంటుంది.

"అలాగేనమ్మా తప్పకుండా" అన్నాడు కమాండర్

కిట్టులు వీపునెక్కాయి. దళం పూరవతల మామిడి గున్నకాసి అడ్డగ కొండ మీదకి పొడిసేసింది.

*  *  *

వారం రోజులు తిరిగింది. బలబల తెల్లారతంది. కొండమీదనుంచి నెమలి అరుస్తుంది.

సాపుకారి అడుగులు తడబడతన్నయ్ మళ్ళీ నచ్చ లైట్లొచ్చినారు. ఇంతకు ముందోలు పోనారు గనుక "సచ్చినోడి పెళ్ళికి వచ్చిందే కట్నంలాగ" పోవలసిన బాపులు మీద ఎకరాకి నాలుగొందలు వచ్చేవి. ఆటికి చావురోజులు దగ్గరై పోనాయి ఆలోచనలు బయపెడుతున్నా బయటకు బయపడకుండా నడుస్తున్నాడు.

కొండ మీద ఒక ఏటు పేలింది (మజిల్ లోడర్ పేలింది) సాపుకారి గుండె జల్లుమంది "నక్సలైట్లు గట్రా పేల్చనేదుకదా!" అనుకున్నాడు.

వూరు దగ్గరైంది సెకలించాడు కుక్కలు "బొవ్వ్" మని అరిచాయి.

ఆ సెకలింపు సాపుకారిదే అని తెలిసి పల్లక తొంగున్నారందరూ....

మొఖలింగం పాకదగ్గరకొచ్చాడు సాపుకారి, వచ్చి నిలబడి—

"ఓరి మొయిలింగా ....మొయ్లింగా.... నెగురా మీద కంచి చల్లగుంది కిందకాసి కుంపటి దానికి తోడు దుప్పటి యెచ్చగుందేమిరా" అన్నాడు మొఖలింగం ఉలుకులేదు పలుకూలేదు దశిమియ్య ఇంటికి వచ్చి వొంగోని పిలిచాడు—

"అవున్రా దశింగా....దశింగా .... ఏంటిరా టక్కొట్టిసినారా తొంగుండి పోనార్రా....దొంగలొచ్చి ఏటి దెంకెలిపోయినా ఇంతే గదరా" అని అన్నాడు

"నీయ్యమ్మ నీకంటా దొంగనాకొడుకు ఇంకెవుడున్నాడురా" దుప్పట్లోనే గొనుక్కున్నాడు —దశిమియ్య

ఒక్కొక్కరు నెగిసినారు మెంబరుగారి అరుగుమీదకూకున్న షాపుకారి దగ్గర చేరారు. సాపుకారి చిట్టా కాగితాలు తీస్తూ—

"ఏటిరా గుమస్తా వస్తే గుద్ద బలిసిన కబుర్లాడారాటర్రా"

"స్నేద్ సాపుకారే! ఈయ్యేడు బొత్తిగ పండనేదు యితనాలైనా రాలేదు ఎలాగిత్తామ్ నాలుగొందలు"

"ఏశేటిరా! అయితేటంతార్రా పంటబోయిందని తిండి మానిత్తరేటిరా!" అన్నాడు సాపుకారి.

కాంమేడ్లు చెప్పిన మాట ఎలాగ చెప్పాలా అని అందరూ ఆతృతై పోతంద్రు... ఎప్పులా ఎదురుబడి చెప్పనేపోత్రను

సాపుకారికి అనుమానం బయం పెరిగిపోతన్నయ్ వడ్డీ పెయ్యాలని వచ్చాడు గానేటి అసలుకే మోసమొత్తంది.

"ఏటిరా! ఎగమెద్దెదానికి చూత్తన్నరేటిరా"

మొఖలింగంగాడు నసుగుతున్నాడు నసుగుతుంటే కళ్ళముందు కాంమేడ్ల మాటలు మెదులుతున్నాయి. ఏయ్. ఏటయిపోద్దీ.... మహా అయితేదళంలో చేరిపోతను అనుకున్నాడు దైర్యం కూడగట్టుకొని

"అప్పు సాపుకారి! ఎగమెట్టడంక్కాదూ.... అబ్బాయి మాది. మాతాతలు తవ్వినారు....మా....అయ్యలు కట్టబడ్డారు నీకెందుకు పన్నుగట్టాల" అన్నాడు.

"ఒరే తాగేసి గట్రా మాట్లాడతన్నవా! నేపోతే గొడ్డు మాంసం తినేసి కొవ్వు బలిసిపోయిందే" దగ్గర నుంచి నెగిసిపోయి మొఖలింగం ముఖంమ్మీద చేయ్యేసి అన్నాడు.

"స్నేద్ సాపుకారీ మీం కట్టం మీ కట్టమంతే కట్టమే" అన్నారెవులో

"తెలిపుండే మాట్లాడతున్నమ్" అన్నారింకెవులో.

"అవునురా అలదన్నూ, ఈలదన్నూ, అన్నలదన్నూ ఉన్నదని మితిమీరి పోతన్నుగావల! అప్పుడి నాగకొండ దొక్కపెట్టి మక్కలిరగదన్నితే అప్పుడు తెలుత్తాది మాసత్తా" అన్నాడు కోపంగా సాపుకారి.
దశిం‌గాడికి కోపం పుట్టుకొచ్చింది

"స్నువ్ జడిపించేదేటీ....నీకిక్కడ గెడ్డలెట్టి తంతే ఎవులుదిక్కు" అన్నాడు దశిమియ్య

సాపుకారికి బయమేసింది. అరుగుమీదనుంచి ఇవతల కొచ్చాడు

లోపలనుంచి ఎవులో కుర్రోడు అరుస్తున్నాడు

"అప్పుడు సింగలపడిన చేపలాగ దొర్కిపోనం ఇప్పుడు దేశమంతా మా అన్నలున్నారు వోయ్".

సాపుకారి రెండడుగులు ముందుకేసి—

"ఉండరా మీసంగతి తేలుత్తాను" అన్నాడు

"మహా చేస్తే ఏటి చేత్తావ్ జైల్లో ట్టిత్తావ్ ఈవాళ జైలు రేపు బెయిల్ అంతేనా మరేటుందా" అన్నారెవరో....

పత్తికోలు ముసిలోడు మంచమ్మీద నుంచి లేచేసరికి ఊరి చివర కెలిపోనాడు సాపుకారి. అయినా ముసిలోడు మునకాలు తీసుకొని నాలుగడుగులేసి

"అప్పుడు నాగక్కాడ్ వోడ్ కేసు పెట్టీనానికి, కేసులెట్టి నరసన్నపేటల కూకోని తినొచ్చు అనుకుంతన్నపుగావ్ల—ఇప్పుడు కామ్రేడ్లుసీపూరి నరసన్నపేటలా వున్నారుమీ అత్తోచూరు అమదాల వలసలావున్నారుఇక్కడ కాసికబురెడితే అక్కడ నీ అంతు చూసెత్తరు" అన్నాడు. సాపుకారి గుండెజల్లుమంది మొన్నంతే మొన్నే నరసన్నపేట యస్సైకి సితక్కతన్నిసినారు. అమ్మో ఈలమీద కేసుపెట్టడానికి పనికి రాదు....అమ్మో ఈ తోవలా గట్టా అన్నలు లేరుకదా! గుండెలు కొట్టుకుంటుంటే గబగబ అడుగులేసాడు.

"మల్లొచ్చినావంతే నీ పెల్లం పిల్లల్నికానవు" మొఖలింగం ఈ మాట అనేసి మునకాలు కర్ర బూమికేసి కొట్టాడు.

ఈ భూమి నాది అన్నట్టుగుంది ఆ కొట్టడము.

సాపుకారి ఒక్కొక్క అడుగు భూమి మీద నుంచి తీస్తుంటే కాల్లకిందనున్న గడ్డిపరకలు లేచి కొనలు దులుపుకుంటున్నాయి.

---

చర్చ :

# రేపటి సామ్యవాదం

మనోరంజన్ మొహంతి

[ తూర్పు యూరప్ పరిణామాల నేపథ్యంలో రాసిన ఈ వ్యాసాన్ని సోవి యట్ యూనియన్ పరిణామాల సందర్భంగా చర్చకోసం పాఠకుల ముం దుంచుతున్నాము —సం. ]

సామ్యవాదమంటే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలని అర్థం. పరాయీకరణ పరిస్థితు లను సృష్టించే పెట్టుబడిదారీ విధానానికిది ప్రత్యామ్నాయం. యూరప్‌లో భూస్వామ్య దాస్యాన్ని సవాల్ చేస్తూ వచ్చిన చారిత్రక పరిస్థితులలో ఉద్భవించిన పెట్టుబడిదారీ విధానానికి మొదట్లో కొంత ప్రగతిశీల లక్షణమున్నప్పటికీ త్వరలోనే అది ఒక దోపిడీ వ్యవస్థగా పరిణమించింది. శ్రమ ప్రక్రియపై శ్రమకు ఉన్న అదుపును, హక్కులను క్రమంగా తొలగించడమే ఈ వ్యవస్థ పెంచి పోషించిన ప్రధానమైన దోపిడీ రూపం. పొలాల్లో, కర్మాగారాల్లో శ్రమను ఉపయోగించే రీతులపై, దాని వల్ల కలిగే ఫలితాలపై శ్రామికుల కెలాంటి అదుపు ఉండదు. ఈ విధంగా నాగరికతా నిర్మాణానికి ఆధారమైన మానవజాతి సృజనాత్మక శ్రమ, అంటే జనాభాలో అధిక భాగమైన శ్రామికుల శ్రమ, తన ఉనికి నుండి క్రమంగా పరాయీకరణకు లోనయింది. శ్రామికులు తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకునే హక్కును రక్షించే ఉద్దేశంతో సామ్యవాద భావన రూపొందింది. శ్రామికుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను రక్షించడం, మానవ పరాయీకరణ మూలాలను నిర్మూలించడం అనే మౌలిక భావనను మళ్ళీ మళ్ళీ నొక్కి చెప్పడమే సామ్యవాద సారాంశం.

పరాయీకరణ కేవలం కర్మాగారాల్లో లేదా ఉత్పత్తి పరిస్థితుల్లో మాత్రమే గాక పెట్టుబడిదారీ సమాజాల్లో సర్వత్రా వ్యాపించి ఉంటుంది. సమాజంలోని సాంస్కృతిక, రాజకీయ సంబంధాల నన్నింటినీ పెట్టుబడిదారీ వ్యవస్థ లక్ష్యసాధనకు మళ్ళించడమే పెట్టుబడి పెరిగే తర్కానికి సంబంధించిన అంతిమ లక్ష్యం. కాబట్టి పెట్టుబడిదారీ వ్యవస్థలో మనుషులు పరాయీకరణ చెందడమనేది ఒక సాధారణమైన లక్షణం. ప్రత్యామ్నాయ స్వాతంత్ర్య దృక్పథమనేది భౌతిక ఉత్పత్తి, రాజకీయ

ప్రక్రియ, సంస్కృతి వంటి అన్ని రంగాల్లో ప్రతిబింబించాల్సి ఉంటుంది. ఇక్కడ ముఖ్యంగా తెలుసుకోవాల్సిన విషయం: ఎప్పుడైతే మనుషులు కొత్త పరాయీకరణ రూపాలను కనుగొంటారో (ప్రస్తుతం ప్రకృతి నుండి మానవుడు పరాయీకరణకు లోనయిన తీరుపట్ల ఆందోళన కనిపిస్తున్నది) అప్పుడు సామ్యవాద దృక్పథంలో స్వాతంత్ర్య భావన కొత్త కోణాలను సంతరించుకొంటుంది.

గత శతాబ్దకాలంలో ప్రపంచ వ్యాపితంగా పెల్లుబికిన సామ్యవాద ఉద్యమాల, ప్రజాస్వామ్య చైతన్యానికి చెందిన సవాల్‌ను ఎదుర్కొనే క్రమంలో పెట్టుబడిదారీ వ్యవస్థలు తమ రూపాలను పునర్నిర్మించుకొని స్వాతంత్ర్యానికి సంబంధించిన లక్ష్యాలనే సాధించడానికి ప్రయత్నిస్తున్నట్టు చెప్పుకొంటున్నవి. ఈ వ్యవస్థలు సాధించిన ఆర్థికాభివృద్ధిని దీనికి నిదర్శనంగా చెప్పడం జరుగుతున్నది. అయితే ఇక్కడ మనం వేయాల్సిన ప్రశ్న: ఈ సమాజాల్లోని పెట్టుబడిదారీ అభివృద్ధి పరాయీకరణను నిరోధించి, స్వాతంత్ర్య పరిధిని విస్తరింప చేసాయా ? అన్నది. ఈ సమాజాల్లో ఎన్నో సౌకర్యాలు లభిస్తాయన్న విషయంలో, మనుషులు వస్తువుల్ని, విషయాలను ఎంచుకునే స్వేచ్ఛాయుత వాతావరణం ఉందన్న విషయంలో సందేహించాల్సిన అవసరంలేదు. కాని మనుషులు ఉత్పత్తి ప్రక్రియ నుండి, తోటి మానవుల నుండి తీవ్రమైన పరాయీకరణకు లోనయి ఉన్నారన్న విషయం స్పష్టంగా అగుపడుతూనే ఉంటుంది. వినియోగదారుల సంస్కృతి (Consumerist culture) ఈ సమాజాల్లో మానవాళికి, ప్రకృతికి మధ్య ఎంతో అగాథాన్ని సృష్టించడమే గాక, ఎన్నో పర్యావరణ సమస్యలు తెచ్చిపెట్టింది. సంచలనాత్మక నేరప్రవృత్తి, ఆత్మహత్యలు, కుటుంబ విచ్ఛిన్నాలు మొదలయినవి పరాయీకరణ పరిస్థితులను తెలియచెప్పే కొన్ని సూచనలు. సంస్కరణలెన్నో వచ్చినప్పటికీ పెట్టుబడిదారీ దేశాల్లోని వ్యవస్థలు సామ్యవాద అభివృద్ధికి ఆధారం కాలేవు, నమూనాలుగా పనికిరావు.

## పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవ సైద్ధాంతిక చట్రం :

స్వాతంత్ర్యం కేంద్ర బిందువుగా రూపొందిన సామ్యవాద దృక్పథం అంటే పెట్టుబడిదారీ విధాన సిద్ధాంత చట్రాన్ని అధిగమించి దాని స్థానంలో పరాయీకరణ ఆధారాల నన్నింటిని నిర్మూలించే ప్రత్యామ్నాయ సోషలిస్టు లేదా కమ్యూనిస్టు సిద్ధాంత చట్రాన్ని రూపొందించాలని అర్థం. సుమారు 1780 నుండి 1880 వరకు

దాదాపు ఒక శతాబ్దంపాటు యూరప్‌లో కొనసాగిన పారిశ్రామిక విప్లవం ఒక రకమైన సామాజిక ధోరణిని, ఆర్థిక సంస్థలతో కూడిన నిర్మాణాన్ని సమాజంలో సృష్టించింది. సాంకేతిక విజ్ఞాన ప్రగతి, పరిశ్రమల హేతుబద్ధమైన నిర్వహణ, భారీ ఎత్తున వస్తు సేవల ఉత్పత్తి, దేశీయంగా, అంతర్జాతీయంగా మార్కెట్‌ను విస్తరింప చేయడం వంటివి కొన్ని ఈ దశలోని పెట్టుబడిదారీ విధాన ప్రధాన లక్షణాలు. ఈ శతాబ్దంలో ఇప్పటి వరకు మరిన్ని సంస్థల వ్యవస్థలను నిర్మించడం జరిగింది, ప్రత్యేకంగా రాజకీయ సంస్థలు, ఉత్పత్తిలో, సమాచార ప్రసరణ పద్ధతిలో నూతన సాంకేతిక విజ్ఞానం ప్రవేశపెట్టడం మొదలైనవి పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవానికి సంబంధించిన సైద్ధాంతిక చట్రాన్ని మరింత సమగ్రంగా పునర్ పటిష్ఠంచేశాయి. ఈ క్రమంలోనే పెట్టుబడిదారీ నిర్మాణాలు మరింత సర్దుబాటుకు లోనయ్యాయి. 1929లో వచ్చిన ఆర్థిక సంక్షోభం తర్వాత సంక్షేమ రాజ్యభావన ఎదిగి, రాజ్యం (State) ప్రత్యక్ష కార్యాచరణలో పాల్గొనడం జరుగుతున్నది. ప్రముఖ ఆర్థికవేత్త కీన్స్ భావాల ప్రభావం, ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ న్యూడీల్ విధానాలు పెట్టుబడిదారీ రాజ్యం, ఆర్థిక వ్యవస్థలో జోక్యం చేసుకొని ఉద్యోగితావకాశాల్ని, సాంఘిక హక్కుల్ని పెంపొందించడానికి ఎక్కువ ఆమోదయోగ్యమైన, గుణాత్మక పాత్రను నిర్వహించడానికి దోహదం చేసినవి. 1970 వ దశకంలో ఈ ధోరణి కొంత వెనుక ముఖం పట్టింది కాని రాజ్యపరిధిని పాక్షికంగా మాత్రమే తగ్గించకలిగింది. రీగన్, థాచర్ విధానాలు రాజ్య క్రియాశీలక ధోరణిని కొంతమేరకు తగ్గించగలిగినవి. ఇక్కడ ప్రధానంగా గుర్తించాల్సిన విషయం: ప్రతీ దశలో పెట్టుబడిదారీ విధానం పునర్నిర్మితమవుతూ పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవ సిద్ధాంత చట్రం పునర్ పటిష్ఠమవుతూనే ఉన్నది.

మార్క్సిజంలోని ఒక ఆలోచనా ధోరణి సోషలిస్టు ఎజెండాను పారిశ్రామిక విప్లవ చట్రంలోకి దించి పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవంలోవలె భౌతిక సంపన్నతను, ఉన్నత సాంకేతిక విజ్ఞాన స్థాయిని సాధించాలని ఆశించింది. సోషలిస్టు రాజ్యాల నాయకులు, కార్మికవర్గ ప్రయోజనాలు సాధించాలనే పేరుమీద పెట్టుబడిదారీ రాజ్యాల ఉత్పత్తి లక్ష్యాలను సాధించడానికి రాజ్యాధికారాన్ని ఉపయోగించారు. పాశ్చాత్య దేశాలను అందుకోవడం (Catching up with west) అనేది ప్రధాన లక్ష్యం, ప్రముఖ కార్యకలాపమవడంతో ఆచరణరీత్యా సోషలిస్టు వ్యవస్థలన్నీ పారిశ్రామిక విప్లవ సిద్ధాంత చట్రంలోనే వ్యవహరించాల్సి వచ్చింది. కాని పెట్టుబడి

ధారీ పారిశ్రామిక విప్లవానికి చెందిన సిద్ధాంత చట్రాన్ని సమూలంగా మార్చడం సామ్యవాదానికి సంబంధించిన అసలైన విషయం. అంటే దీని అర్థం మానవ అవసరాలను తీర్చే ఉత్పత్తి శక్తులు అభివృద్ధి చెందే అవసరాన్ని నిర్లక్ష్యం చేయడం కాదు; ఉత్పత్తి పెరుగుదల ద్వారా వచ్చే అభివృద్ధి లక్ష్యం స్వాతంత్ర్యానికవసరమయిన భౌతిక పరిస్థితులను సృష్టించడంపై కేంద్రీకరించాలి. కాని సామ్యవాదానికి చెందిన తాత్విక, భావజాల పునాది సోషలిస్టు నిర్మాణానికవసరమయిన విధానానికి, విద్యకు అనుగుణంగా లేదు. దీని ఫలితంగా సోషలిస్టు దేశాల పౌరులు పెట్టుబడిదారీ దేశాల్లో లభించే సౌకర్యాల కోసం ఆశించడం మొదలయింది. ఆ యా దేశాల విప్లవాలు వాగ్దానం చేసిన స్వేచ్ఛకు సంబంధించిన ప్రత్యామ్నాయ విలువలు, సమానత్వం వంటి విషయాల పట్ల చైతన్యం మరీ తక్కువయిపోయింది.

సోషలిస్టు వ్యవస్థల్లో అధికారవాద స్వభావం కలిగిన, కేంద్రీకృత ధోరణి గల బ్యూరోక్రాటిక్ యంత్రాంగాన్ని నిర్మించడం జరిగింది. ఈ బ్యూరోక్రాటిక్ నియంత్రణ ఎక్కువ స్థాయి అభివృద్ధి రేటు సాధించాలనే సిద్ధాంతం ఆధారంగా సమర్థించబడింది. న్యాయంగా చెప్పాలంటే స్టాలిన్ కాలంనాటి చారిత్రక పరిస్థితులను విస్మరించడానికి వీల్లేదు. ఫాసిజంవల్ల పెరిగిన సవాళ్ళ, సామ్రాజ్యవాద దేశాల ఒత్తిడివల్ల సోవియట్ యూనియన్ నాయకత్వం ఆ దేశ పారిశ్రామిక రక్షణావసరాలకు, శక్తికి అత్యంత ప్రాధాన్యత ఇవ్వాల్సి వచ్చింది. అయినప్పటికీ సోషలిస్టు వ్యవస్థను బలహీనపరిచే అంశాలు ముఖ్యంగా అధికారవాద తత్వం, రాజకీయ ఉగ్రవాదం. ఈ రెండు అంశాలు రాజకీయ పరాయీకరణను మరింత వేగవంతం చేసినవి. స్టాలిన్ తదనంతరం కూడా ఇదే సిద్ధాంత చట్రాన్ని అనుసరించడం వల్ల కార్మికుల నుండి, సాధారణ ప్రజానీకం నుండి పరాయీకరణకు గురి అయిన ఒక 'కొత్త వర్గం' (new class) తలెత్తింది. అన్ని సౌకర్యాలు పొందిన ఈ వృత్తిపరమైన శిష్టజనవర్గం (elites) ముఖ్యంగా పారిశ్రామిక మేనేజర్ల నుంచి పార్టీ లేదా ప్రభుత్వ ఉద్యోగి బృందం నుంచి పుట్టుకొచ్చింది. ఈ వర్గాన్ని 'బ్యూరోక్రాటిక్ బూర్జువా వర్గం'గా పిలవడం జరుగుతున్నది. ఆర్థికాభివృద్ధి టెంపోను నిర్వహించాలనే కారణంపై ఈ వర్గం అస్తిత్వాన్ని, అభివృద్ధిని సమర్థించడం జరిగింది. కాని ఆచరణలో అసమర్థతకు, అవినీతికి లోనై కేంద్ర అధికారం నీడలో రక్షణ పొందిన ఈ వర్గం శుష్క సోషలిస్టు నినాదాలనే గాని నిరంతర అభివృద్ధిని కొనసాగించలేకపోయింది.

పెట్టుబడిదారీ పారిశ్రామిక సైద్ధాంతిక చట్రం పరిధిలోనే అవిచ్ఛిన్నంగా పనిచేయడం, సోషలిజం తనదైన ఒక స్వతంత్ర దృక్పథం కోల్పోవడం మూలంగా రక రకాల సమస్యలు ఒకదాని తరువాత మరొకటి ఈ వ్యవస్థలో ఆగకుండా వస్తూనే ఉన్నాయి. వినియోగ వస్తువుల కొరత ఈ సోషలిస్టు దేశాల ఆర్థిక వ్యవస్థల సాధారణ లక్షణమయి ఇవి 'కొరత ఆర్థిక వ్యవస్థలు'గా పేరుపడి పోయినవి. సోవియట్ యూనియన్‌లో వచ్చిన అసంపూర్ణ అభివృద్ధి భారీ పరిశ్రమలు, ఉక్కు ఉత్పత్తి మొదలైన రంగాల్లో ఎంతో అభివృద్ధి సాధించినప్పటికీ, వ్యవసాయరంగం వెనుకబడిపోయిన కారణంగా సమాజం తీవ్రమైన ఉద్రిక్తతకు లోనయింది. కేంద్రీకృత రాజ్యంపై అత్యధిక సంఖ్యాకమైన జాతుల ఆధిపత్యం — సోవియట్ యూనియన్‌లో రష్యన్ జాతి, చైనాలో హాన్ జాతి— వల్ల రాను రాను మైనారిటీ జాతులు దూరం చేయబడ్డాయి. జాతుల సంస్కృతీ అభేదత్వానికి (Cultural Identity) సంబంధించిన సాపేక్ష స్వయం ప్రతిపత్తి (relative autonomy) ని గుర్తించక పోవడంవల్ల, సోషలిస్టు సంస్కృతి విభిన్న వర్గాల ప్రజలను శ్రామిక వర్గంలో విలీనం చేస్తుందనే భావం ఆచరణలో నిజంకాలేదు. అందుకే జాతుల ప్రజాస్వామిక చైతన్యానికి సంబంధించిన సాధారణ తిరుగుబాటు అనేక ప్రాంతాల్లో జాతుల ఉద్యమ రూపంలో బయటపడింది.

పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవం సామ్రాజ్యవాదాన్ని సృష్టించింది. సామ్రాజ్యవాద సవాళ్ళ నెదుర్కొనడానికి సోషలిస్టు ప్రపంచానికో నాయకుడు కావాలని భావించారు, ఆ పాత్ర మొట్టమొదటి సోషలిస్టు రాజ్యమైన సోవియట్ యూనియన్ నిర్వహించింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం స్టాలిన్ నిర్దేశనలో నడిచింది. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసే కాలంనాటికి తూర్పు ఐరోపా దేశాల్లో కమ్యూనిస్టు వ్యవస్థలు స్థాపించడం జరిగింది. ఆ తరువాతి దశాబ్దాల్లో యుగోస్లావియా, రుమేనియా, అల్బేనియా దేశాలు తప్ప, సోవియట్ యూనియన్ మిగతా తూర్పు యూరప్ దేశాల మధ్య ఏర్పడ్డ సంబంధాలు అసమ సంబంధాలుగా పరిణమించినవి. ప్రచ్ఛన్న యుద్ధకాలంలో సోవియట్—చైనా వైషమ్యాల కాలంలో ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో సోవియట్ యూనియన్ ప్రయోజనాలు పెంపొందించే రాజకీయాల వల్ల ఉపగ్రహ రాజకీయ వ్యవస్థలు (Setellite Political Systems) సృష్టింపబడి అవి స్థానికంగా, అంతర్జాతీయంగా తీవ్ర విమర్శలకు

లోనయినవి. స్టాలిన్, ఆ తరువాతి వ్యవస్థల తప్పుడు విధానాలను రెండు అంశాలపై గుర్తించవచ్చు. మొదటిది: సామ్రాజ్యవాద– కార్మిక వర్గ విప్లవాల యుగంలో ప్రధాన శక్తి అయిన జాతీయవాదాన్ని సమగ్రంగా గుర్తించడం జరుగలేదు. ఆచరణలోకి వచ్చిన అంతర్జాతీయవాదానికి సమకాలీన సమాజ పునాది లేకుండా పోయింది. తరుచుగా సోవియట్ యూనియన్ ప్రయోజనాలే అంతర్జాతీయ వాదానికి ప్రతీకలుగా ముందుకొచ్చినవి. రెండవది: సామాజిక విప్లవ స్వభావమేమిటంటే దేశీయ పరిస్థితులకు స్పందిస్తూ దేశంలోనే ఉద్భవించిందిగా కావాలి. చైనీయులు, యుగోస్లావ్‌లు, ఇప్పటి తూర్పు ఐరోపా దేశాల ఉద్యమాలు ఈ విషయాలను రుజువు చేసినవి. జాతీయవాదం, అంతర్జాతీయవాదాల గతితర్కం ఈ రెండు అంశాలను గౌరవించాలి. ఈ రెండు విషయాల్లో ప్రజల చైతన్య స్థాయిని గుర్తించి వాళ్ళు విప్లవ ప్రక్రియలో పాల్గొనే క్రమాన్ని రూపొందించాలి.

అన్ని రంగాల్లో స్వతంత్ర మార్గాన్ని ఎంచుకోవడం, పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవాన్ని సర్వోత్కృష్టమైనదిగా మార్చడమనే మౌలిక భావనను భవిష్యత్ సామ్యవాదం గుర్తించి తిరిగి చేపట్టాలి.

## సైద్ధాంతిక పునర్ రూపకల్పనలు :

ప్రపంచ వ్యాపితంగా రాబోయే యుగం పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవం నుండి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల యుగంలోకి మారే యుగం. కేంద్రీకృత రాజ్యానికి, ఆధిపత్యం చెలాయించే అధికారయుత నిర్మాణాలకు, పరాయీకరణ విధానాలకు వ్యతిరేకంగా ప్రపంచ వ్యాపితంగా ప్రజలు ఉద్యమిస్తున్న రోజులివి. నిజానికి సామ్యవాద ప్రయోగం ఈ రకమైన అభివృద్ధిని నిరోధించి ప్రత్యామ్నాయ వ్యవస్థను నిర్మించే ఉద్దేశంతోనే నిర్వహించబడింది. సోషలిస్టు వ్యవస్థలు ఎంతో సాధించినప్పటికీ క్రమంగా అవి పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవం నిర్మించిన ఒక రకమైన ఉచ్చులో ఇరుక్కున్నవి. ప్రజా జీవన మౌలిక అవసరాల్ని, ఉద్యోగాల్ని కల్పించడం ద్వారా సామాజిక భద్రత ఏర్పరచడంతోపాటు కార్మిక వర్గ గౌరవాన్ని పెంపొందించగలిగినవి. అంతేగాక సామ్రాజ్యవాదాన్ని, పెట్టుబడిదారీ విధానాన్ని ఎదుర్కొంటూ విసిరిన సవాళ్ళ మూలంగా ప్రపంచంలో ఈ వ్యవస్థలు కొంత మేరకు ప్రజాస్వామ్యీకరించబడ్డవి. అయినప్పటికీ ఈ సోషలిస్టు వ్యవస్థలు తమ లక్ష్యాలను

సాధించడంలో ఇంకెంతో ప్రయాణించాల్సి ఉన్నది. కొన్ని సమస్యల పరిష్కారంలో మనం కేవలం సోషలిస్టు వ్యవస్థలను మాత్రమే నిందించాల్సిన అవసరంలేదు. ఎందుకంటే ఈ సమస్యలన్నింటికీ ఈ మధ్యకాలంలోనే ప్రపంచవ్యాపితంగా ప్రాధాన్యత పెరిగింది. ఉదాహరణకు పర్యావరణం, స్త్రీల హక్కులు, జాతుల స్వయం ప్రతిపత్తి, అభివృద్ధి కనుగుణమైన సాంకేతిక విజ్ఞానం, ప్రపంచ శాంతి మొదలైనవన్నీ అవి ఆవిర్భవించిన సందర్భంగా అన్ని రకాల భావ జాలాలకు కొత్త సవాళ్ళను విసురుతున్నది. ఈ రకంగా ముందుకొస్తున్న సవాళ్ళన్నీ పెట్టుబడిదారీ పారిశ్రామికీకరణ ఉత్పాదితాల (by products) కు సంబంధించిన ప్రతి చర్యలని అర్థం చేసుకొంటే సోషలిస్టులు స్వేచ్ఛా స్వాతంత్రాల పట్ల తమకున్న దృక్పథంతో వీటిని తమ భావజాలంలో విలీనం చేసుకోవచ్చు. గత అనుభవాన్ని పరిగణనలోకి తీసికొని దానిలోంచి ఉద్భవించే సమస్యల ఆధారంగా సిద్ధాంతాన్ని పునర్మించుకోగలిగితే స్వేచ్ఛా స్వాతంత్ర్యాల నూతన యుగంలోకి కదిలే ప్రాపంచిక మార్పును సమర్థవంతంగా కొనసాగించే శక్తి సోషలిస్టులకు మాత్రమే ఉన్నది.

## వ్యక్తి - సమాజం :

వ్యక్తి ఉన్నతిని నిరోధించే సామాజిక వ్యవస్థను నిర్మించాలనే మూఢ భావ జాలాన్ని సోషలిజమెప్పుడూ బోధించదు. యూరప్‌లో పదిహేడవ శతాబ్దంనుండి అభివృద్ధి అయిన పెట్టుబడిదారీ పోటీని ప్రోత్సహించే వ్యక్తి వాదాన్ని మార్క్స్ తీవ్రంగా విమర్శించాడు. వ్యక్తి ఒక వర్గంలోని సభ్యునిగా చారిత్రకంగా ఎన్నో శక్తి-సామర్థ్యాలు, మరెన్నో బలహీనతలు, అశక్తతలు కలిగి ఉంటాడు. కాబట్టి ఒక వ్యక్తి వర్గాధిపత్యం నుండి విముక్తి అయ్యే క్రమంలో తనదైనటు వంటి సర్వోత్కృష్ట నైపుణ్యాన్ని సాధించే అవకాశం కలుగుతుంది. కాబట్టి వ్యక్తి కేవలం వర్గాధిపత్యం నుండి ఉద్భవించే బంధనాల నుండే గాక, జాతి, కులం, మతం వంటి విషయాలనుండి పైకొచ్చే ఆధిపత్యం నుండి విముక్తి చెందాల్సిన అవసరమున్నదని భావించాలి. వివిధ రంగాల్లో ఉన్న స్వాతంత్ర్యం వ్యక్తి తన శక్తి సామర్థ్యాలను గుర్తించే పరిస్థితులను సృష్టిస్తుంది. మొదట తన కుటుంబంనుండి ఆ తరువాత వివిధ రకాల సామాజిక వర్గాలు, క్రమంగా తన జాతి, అంతిమంగా ప్రపంచ మానవాళి ఈ విధంగా వ్యక్తి వివిధ స్థాయిల్లో తన అభేదత్వాన్ని

(Identity) ప్రకటించుకొంటాడు. ఈ అన్ని స్థాయిల్లోను వ్యక్తి తన అభేద [illegible] పొందడానికి అనుకూలించని కొన్ని అస్వతంత్రతా ప్రాంతాలు వ్యక్తిలో కొనసాగుతూనే ఉంటాయి. మార్క్సిస్టు పద్ధతికి చెందిన చారిత్రిక భౌతిక వాదం ఈ అన్ని స్థాయిలను ఒక దగ్గర చేర్చి ఒక చారిత్రిక పరిస్థితికి సంబంధించిన ఒక సమగ్రమైన దృశ్యమివ్వడానికి తోడ్పడుతుంది. కాని ఇది ఇతర స్థాయిల్లోని ఆధిపత్యాన్ని విస్మరించదు. వ్యక్తికున్న ఎన్నో సంబంధాలను అసంపూర్ణంగా అర్థం చేసుకోవడంవల్ల వ్యక్తికి సమాజానికి మధ్య, పౌరునికి రాజ్యానికి మధ్య విభేదం సృష్టించబడింది. సోషలిస్టు రాజ్యాలకు చెందిన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం సమాజ ప్రయోజనాల పేరుమీద వ్యక్తి స్వేచ్ఛను మరింత కుదించే ఎన్నో చర్యలు చేపట్టారు. కార్మికవర్గం ప్రయోజనాల పేరు మీద కేవలం పెట్టుబడిదారీ విలువలను తలకిందులు చేసారు. కాని సామ్యవాదం అన్ని రంగాల్లో వ్యక్తి సంపూర్ణాభివృద్ధిని ఆశిస్తుంది.

## పార్టీ, రాజ్యం, ప్రజాస్వామ్యం :

కార్మికవర్గ ప్రయోజనాలను రక్షించే అగ్రగామి వ్యవస్థగా, విప్లవానంతరం కార్మికవర్గం పక్షాన రాజ్యాధికారం నడిపే పార్టీగా కమ్యూనిస్టుపార్టీ పాత్రను తప్పుడుగా అర్థం చేసుకోవడం జరిగింది. సమానత్వం, హేతుబద్ధత, సృజనాత్మకత, సంఘీభావంవంటి విలువలు పంచుకొనే విధంగా సమాజంలోని ఇతర వర్గాలను మార్చే క్రమంలో సమాజానికి కార్మికవర్గానికి మధ్యవర్తిత్వం నిర్వహించే పాత్రను కమ్యూనిస్టుపార్టీ చేపట్టాలి. ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక బంధనాలనుండి విముక్తిచేసి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలమీద ఆధారపడిన నాగరికతను నిర్మించడానికి ఈ విలువలను నిరంతరంగా పోషించాలి. అదే విధంగా కార్మికవర్గ అధికారానికి రూపమిచ్చిన సోషలిస్టు రాజ్యానికి, కార్మికవర్గానికి ఇతర వర్గాలకు, అంతేగాక వివిధ రకాల ఉపజాతుల మధ్యనున్న వైరుధ్యాలను పరిష్కరించి మొత్తంగా సమాజాన్ని మార్చే పాత్ర నిర్వహించాల్సిన బాధ్యత ఉన్నది. ఈ ప్రక్రియ మొత్తం విప్లవానికిముందు, విప్లవానంతరంకూడా వివేచన, పోరాటంద్వారా కొనసాగుతుంది. ముఖ్యంగా విప్లవానంతరం అధికారం చేపట్టిన తర్వాత, కార్మికవర్గం (లేదా ప్రజా నియంతృత్వం లేదా అల్పసంఖ్యాకులపై అధిక సంఖ్యాకుల పాలనే కావచ్చు)

తన విధానం, నిర్వహణ, నచ్చచెప్పే పద్ధతులతో రాజకీయ ఆచరణద్వారా పార్టీ తన అభిప్రాయాలను నిరూపించుకోవాలి. సామ్యవాద సాధన అనే విశాల పరిధిలోనే ప్రజాస్వామిక సంస్థల, పద్ధతుల నిర్వహణ, వ్యక్తీకరణ స్వేచ్ఛ, బహిరంగచర్చలు పోటీ రాజకీయ సంస్థలను కొనసాగనివ్వాలి. రివిజనిజం పెరగడం, సామ్రాజ్యవాద విద్రోహంవంటివి మాత్రమే సోషలిస్టు దేశాల్లోని అధికారపార్టీ నాయకత్వానికి ప్రధాన భయాలు కావల్సిన అవసరంలేదు. కాని విప్లవాన్ని రక్షించే యుద్ధంలో విప్లవ శక్తులన్నీ ఐక్యంగా పాల్గొనాలి. బూర్జువా సమాజంలో ప్రజాస్వామిక ఆచరణ, సంస్థలన్నిటిని పెట్టుబడిదారులు, వాళ్ళనాశ్రయించిన వ్యక్తులు తమ కను కూలంగా రూపొందించి వాడుకొంటారు. కాని సామ్యవాద సమాజంలో ఈ ప్రక్రియ సంస్థలు కార్మికులకు, రైతులకు ప్రజలందరికీ అందుబాటులో ఉండాలి. అదనంగా వీటితోపాటు సామ్యవాదం ఒక సమగ్ర స్వాతంత్ర్య భావనకు, (భౌతిక, రాజకీయ, సాంస్కృతికపరమైన) మానవాళిని మొత్తంగా అన్నిరకాల బంధనాలనుండి విముక్తిచేసే ప్రాపంచిక దృక్పథాన్ని ప్రజల ముందుంచుతుంది. ఈ రకంగా సోషలిస్టు స్వాతంత్ర్యభావన, బూర్జువా స్వాతంత్ర్య భావనకన్నా ప్రత్యేకమైనది, ఉన్నతమైనది.

## ఉత్పత్తి, మార్కెట్ అభివృద్ధి :

సరకుల ఉత్పత్తి ఆర్థిక వ్యవస్థ అభివృద్ధిపై జరుగుతున్న చర్చ వైరుధ్య లక్షణం సంతరించుకొని దానిలో ముఖ్యంగా ఉత్పత్తి ఎందుకొరకు ? అన్నప్రశ్నను విస్మరించింది. పెట్టుబడి పెరిగే ప్రక్రియ గుత్తాధిపత్య ధోరణులను, సప్లై - డిమాండ్ స్థితిని ఆధిపత్యంతో, నేర్పరితనంతో మల్చుకొనే పరిస్థితిని సృష్టించింది. సమకాలీన ప్రపంచంలో ఈ పరిస్థితి, ధోరణులు కొనసాగుతునే ఉన్నవి. ఈ విధమైన మరుగు పరిచే నేర్పరితనంతో పెట్టుబడి వ్యవస్థ తన ఉత్పత్తులకు డిమాండ్ కల్పించుకొని, లాభాలు సంపాదిస్తూ కొనసాగుతూనే ఉన్నది. ఈ విధంగా మానవులు అవసరాలను పెంచే/విస్తరించే వినియోగదారులుగా, పెట్టుబడిదారులు నిర్ణయించే ఉత్పత్తి వ్యవస్థలో పాల్గొనే వ్యక్తులుగా కుదించబడుతారు. ఈ ధోరణిని సోషలిస్టు వ్యవస్థలోని ప్రణాళికావేత్తలు కేంద్రీకృత ప్రణాళికా విధానంతో ఎదుర్కొనడానికి ప్రయత్నించారు. కాని ఈ క్రమంలో దేశంలో, బయటా ప్రబలంగా ఉన్న వాస్తవ సప్లై -

డిమాండ్ పరిస్థితిని తమ దృష్టిలోకి తీసుకోలేదు. సమాజంలో కింది స్థాయిల్లో ఉన్న నిజమైన సప్లై - డిమాండ్ పరిస్థితిపై వారికి సరిఅయిన అవగాహన లేదు. ఉత్పత్తి లేక మార్కెట్ స్థాయిని ప్రతిఫలించలేనందువల్ల వారి ధరల విధానం కృత్రిమంగా తయారయింది. దీనికి వ్యతిరేకంగా వాళ్ళు ఇప్పుడు పెట్టుబడిదారీ మార్కెట్ పద్ధతులు, ధరల విధానం, వనరుల - వేతన నిర్వహణ మొదలైన సంపూర్ణ పెట్టుబడి దారీ విధానాన్ని అవలంబించే స్థితికి తిరిగారు. కేంద్రీకృత ప్రణాళికా విధానాన్ని అతి త్వరగా పోటీ మార్కెట్ పద్ధతి ఆక్రమిస్తున్నది.

సోషలిస్టు వ్యవస్థ ఒకవేళ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కవసరమయిన భౌతిక పరిస్థితులను సృష్టించదలుచుకొంటే ఉత్పత్తి వ్యవస్థను ప్రజాస్వామ్యీకరించడం తన లక్ష్యంగా ఉంచుకోవాలి. ప్రజాస్వామిక భాగస్వామ్య పరిస్థితులలో సరుకు ఉత్పత్తి ఆర్థిక వ్యవస్థలో కూడా అభివృద్ధి చెందగలుగుతుంది. కార్మిక సంఘాలు, వ్యవసాయోత్పత్తిదార్ల సహకార సంఘాలు, పోటీ రాజకీయ వ్యవస్థలు విధించే పరిమితులలో కూడ దేశీయ మార్కెట్ పనిచేయగలదు. కష్టించి పనిచేసే వాళ్ళకు ప్రోత్సాహకాలు లభ్యమయేటట్లు చూడడమేగాక, కష్టపడి పనిచేయడం సోషలిస్టు వ్యవస్థ నిర్మాణానికి ఒక విలువగా రూపొందించాలి. అభివృద్ధి అంటే కేవలం ఆర్థిక స్థాయి పెరుగుదల మాత్రమేకాదు, దీనితోపాటు అసమానతలు తొలగించడం అన్ని స్థాయిల్లో నిర్ణయాలు తీసుకోవడంలో పాల్గొనే అవకాశాలు పెరగడం, స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలు విస్తరించడం కూడ. ఈ విలువ ఆధారంగా ఆర్థిక విధానాన్ని వ్యవస్థీకరించాలి. మార్కెట్‌కు, ప్రణాళికీకరణకు మధ్య వైరుధ్యం సృష్టించే ఆలోచనా ధోరణి నుండి సోషలిస్టు వ్యవస్థలు దూరంగా కదిలిపోవాలి.

## స్వసవరణా సిద్ధాంత గతితర్కం :

వీటన్నింటిలోను ముఖ్యమైనది: సిద్ధాంతం, ఆచరణకు సంబంధించిన గతితర్కాన్ని సమర్థించుకోవడం. గతితార్కిక భౌతిక వాదం సత్యంపై ఆధిపత్యం వహించే ధోరణిని ప్రశ్నిస్తుంది. అది వేదమైనా, మతాధిపతులు చెప్పినా, పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవం ముందుకు తెచ్చిన సాంకేతిక హేతువాదం చెప్పినా, సత్యంపై ఈ గుత్తాధిపత్య ధోరణిని వ్యతిరేకించాల్సిందే. కాబట్టి గతి తార్కిక భౌతిక వాదాన్ని ఆచరించే వాళ్ళంతా ఇదే తర్కానికి లోబడి వ్యవహరించాలి. సోషలిస్టులు

నాయకత్వం వహించే ఉద్యమంలో, నిర్మించే వ్యవస్థల్లో; సత్యాన్ని ఆవిష్కరించే, అసత్యమని కనుగొన్న విషయాలను సరిదిద్దుకొనే ఆచరణలో ప్రజలు గతితార్కిక హేతువులో పాల్గొనే విధంగా వ్యవస్థలు, ఆచరణ రూపొందింపబడాలి. ఈ విధంగా ప్రజాస్వామిక ఆచరణ గతి తార్కిక హేతువును ఆవిష్కరించే క్రమంలో ఉండాల్సిన మొదటి అవశ్యక విషయం. అయితే ఈ విషయాన్ని సమాచార ప్రసార విప్లవం ద్వారా సాధించగలమని పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవం నమ్మ చూపింది. కాని నిజానికి సాధారణ పౌరుణ్ణి నిస్సహాయుడిగా చేసే కొత్త నైపుణ్య రూపాల్ని మాత్రమే సృష్టించింది. తమ స్వంత తప్పిదాలను సరిదిద్దుకునే ప్రక్రియను నిర్మించడంలో సోషలిస్టు వ్యవస్థలు తగినంత శ్రద్ధ వహించలేదని చెప్పవచ్చు. ఇది జరగాల్సింది విప్లవం తరువాతనా, ముందా అన్న విషయం ముఖ్యంకాదు. సోషలిస్టు ఉద్యమం మొదలయిన మొదటి రోజునుండే ఇది సోషలిస్టు భావంలో అంతర్భాగ మయిపోవాలి. ఇలా జరిగినప్పుడే విప్లవం విజయవంతం అయిన తరువాత కూడ స్వసవరణ, వ్యక్తిగతాభివృద్ధి కవసరమయిన మరిన్ని నిర్మాణాలను, ప్రక్రియలను విప్లవకారులు రూపొందించగలరు. బహుశా రేపు రాబోయే సామ్యవాదం ఈ రూపంలో ఉంటుందని అనుకోవచ్చు.

(అను : కె. సీతారామారావు)

(జనత - 1991 వార్షిక సంచిక నుంచి)

---

సీరియల్ నవల :

# రాగో

సాధన

(గత సంచిక తరువాయి)

## 8

భళ్ళున తెల్లారింది. తూరుపు పొద్దు కరకర పొడుస్తుంది. తొలిపొద్దుకి ఆహ్వానం పలుకుతున్నట్లు ఆకులు ఆనంద భాష్పాలు రాలుస్తున్నాయి. నాలుగు రోజులుగా ముసురులో తడిసిన చెట్లు తలారబెట్టుకుంటున్నట్లు పిల్లగాలులకు సుతారంగా తలలాడిస్తున్నాయ్. పొద్దు వెచ్చవెచ్చగా పెరుగుతూంటే ఆ పొడిపొడి వాతావరణంతో ఒళ్ళు పులకరించినట్టుగానే ఉంది. అడవిలోని పిట్టలు కిచకిచమంటున్నాయి. ధీకొండలోని పోలీసు పటేల్ పుఫ్లా పావురాలు గూడునుండి బయటకు ఎగిరి సోలార్ లైటు స్తంభం మీద, బ్యాటరీ పెట్టెమీద సయ్యాటలాడుతున్నాయి.

పుఫ్లా భార్య జానో 'గినో్న్న, గినో్న్న' అంటూ పందులను తౌడుకు, 'కోర్, కోర్, కోర్' అంటూ నూకలు, ఉనుక చల్లుతూ కోళ్ళనూ, 'డుర్ నైయ్యి డుర్ డుర్' అంటూ అంబలికి కుక్కను ఆప్యాయంగా పిలుచుకుంటుంది.

ఇంటిముందు పందిట్లో కూచుని పుఫ్లా జంట నెమళ్ళకి నూకలు చల్లుతున్నాడు. పాపిష్టి గాద్దు యేనాది కిందట ఎత్తుకపోయిన మరో జంటను తలుచుకున్నపుడల్లా పోలీసు పటేల్ ఒళ్ళు మండుతుంది. అడవిలో దొరికిన నెమలి గుడ్లు తెచ్చి కోడికాడ పొదుగేసి పెంచుకున్న నెమళ్ళను నానా హంగామా చేసి ఆ దుర్మార్గుడు ఎత్తుకపోయిండు. ఈ జంట పెరట్లో ఉండిపోయి వాని కంట్లబడక బతికిపోయింది.

పుఫ్లా బిడ్డ షాంకో తన లోకంలో తానుగా 'విట్టో, విట్టు' అంటూ రామచిలుకకు మాటలు నేర్పుతూ పంజరంలోకి మెతుకులు అందిస్తూంది. బతుకు గూర్చి తెలిసిరాని వయస్సు షాంకోది.

ఆనాడు ఆదివారం పోల్వ (పండుగ) చేయాలని గుర్తొచ్చి ఉంది ఘాష్యల్

ఘోతుల్ వద్ద నుండి ఊళ్ళోకి బయలుదేరాడు. రాజులూ, రాజ్యాలూ పోయినా తాత తండ్రుల నుండి వస్తున్న భూమ్యని హోదా వేడినీళ్ళకు చన్నీళ్ళలా సన్నోకు ఎంతో ఆసరాగానే ఉంటుంది. ఊరికొక భూమ్యల్ ఉంటాడు. అలాగే పట్టీ అంతటికి వేరుగానే మరో భూమ్యల్ ఉంటాడు. పట్టిభూమ్యల్ హోదా పెద్దది. రాజుల కాలంలో ఎక్కడికక్కడ ప్రజలను అదుపు చేయడానికి, పన్నులు వసూలు చేయడానికి తయారుచేసుకున్న యంత్రాంగంలో కీలకపాత్ర వహించారు ఈ భూమ్యల్లు. ఆజనుల కొద్ది గ్రామాలు గల పట్టీలలో నేటికీ వీరి పటాటోపం మాసిపోలేదు. మహారాజు విశ్వేశ్వరరావుగారి ధోరణిలో వచ్చే ప్రతి మార్పుకు వీరు 'ఇంగో' అంటూ తలాడిస్తారు. ఊళ్లల్లో సంఘాలు ప్రారంభం కావడంతో వీరు గోడమీది పిల్లుల్లా తయారయ్యారు. బరితెగించి దోపిడి చేసే ప్రభుత్వ గార్డులు, జులుం సాగించే పోలీసులు, నిలువుదోపిడి చేసే షావుకార్లను ఎదిరించి లఢాయి చేయాలనీ అన్నలు ప్రచారం చేస్తే వీరు సై అంటే సై అన్నారు. లేరా పాత రివాజులు, అర్థంలేని ఆచారాలు ఇకపై చెల్లవంటూ యువకులకు మద్దతుగా నిలబడేసరికి తమ పెత్తనానికే ఎసరొచ్చిందనీ బెంబేలుపడి మళ్ళీ మహారాజు పక్షం అయ్యారు.

మాటకెదురు లేకుండా ఆచారాలు అమలు జరగాల్సిందే. అంటే తమ పిల్లలే వినేట్టులేరు. పద్ధతులు మారడానికి వీలులేదని అన్నల్తోనే వాదిద్దామంటే వారి ముందు నోరు పెగల్దు. ఇదీ వారి అవస్థ. తాగినపుడల్లా ఊళ్ళో యువకులకు పెద్దలకు మధ్య ఇదే లొల్లి. 'కొత్త కోడెకు కాని తలిగిచ్చినట్టు' ముసలాళ్ళ ధోరణి యువకులకు రెచ్చగొట్టినట్టుంటుంది. 'ముడ్డిమీద ముల్లుపడితే ఎగిరి చంగున గెంతులేసే కోడె తీర' మీ మాటలు మేం పడేది లేదని సంఘపోల్లు బదులు చెప్పేసరికి వేడుకోల్లు-దేబరింపులు మొదలవుతాయి. అన్నల ఎదుటికొచ్చేసరికి ఈ సన్నాయి నొక్కులన్నీ బందవుతాయెందుకన్నదే యువకులకు అర్థం గానిది.

పోల్వా గురించి ఆలోచిస్తూ ఊళ్ళో అడుగుపెడుతున్న భూమ్యల్ సన్నోకు ఇవన్నీ తొలుస్తున్నట్లవుతుంది. గోటుల్ వద్దకు చేరిన సన్నోకు అక్కడ దుమ్ములో పడి ఎగురుతున్న కాగితాలు కనపడేసరికి అవి ఏరుకోబుద్ధి అయ్యింది. కంటికి అతి దగ్గరగా పెట్టుకున్నా ఒక్క అక్షరం ముక్కకూడా కనబడ్డంలేదు. చత్వారి వచ్చాక మరీనూ అనుకుంటూ చదువు వచ్చిన వాళ్ళతో చదివించుకుందామని ఆ కాగితాలు జేబులో కుక్కి బిర బిర నడుస్తూ పటేల్ ఇంటిముందుకొచ్చాడు.

"పుస్లా ! ఏయ్ గైతా" (పటేలా) అంటూ కేకలేయసాగాడు.

"ఏం బాబో (బావ). ఏం కొంపమునిగింది. కేకలేస్తున్నావు" అంటూ దీర్ఘం తీస్తూ పటేల్ బదులు పలికాడు.

"ఆఁ! ఏం లేదు. ఇవ్వాల పోల్వ చేయాలిగదా" అంటూ పోల్వ సంగతి గుర్తు చేశాడు.

"ఆఁ! అది నిజమే. కానీ ఏం పోల్వనో బాబో. రావూ లోపలికి. అపుత లుండే మాట్లాడుతున్నావు. ఆదివారం ఆదివారం హమేషా పోల్వ చేస్తున్నమాట నిజమే. కానీ ముసుర్లు కూడ పడక పడక ఈ సందులోనే పడబట్టె. అసలే ఇసుక పర్రెలు. ఉస్కలో ఉచ్చబోసినట్టినాయె ఈ భూములల్ల వాన యవారం. నీళ్ళు నిల్చిన పొపాన పోవాయె. బురద లేకుంటే నాట్లు కుదరవు. అందరికి పనుల సందే నాయె. పై ఆదివారం పోల్వ చేద్దామనుకుంటున్నా" అంటూ మెల్లగా పటేల్ పోల్వ వాయిదా వేయాలన్న విషయం ప్రస్తావించాడు. "వారం వారం ఒకరోజు పోల్వ దినాన సెలవు తీసుకునుడంటే మనమేమన్నా సర్కార్ జీతగాళ్ళమా ! ఓ వారం తప్పినా వచ్చే నష్టం ఏం లేదు కదా" అంటూ పటేల్ సన్నో ముఖంలోకి చూశాడు.

వారంలో ఏ రోజైనా ఊళ్ళో పోల్వ జరుపుకోవచ్చు. అయితే అది ఊరి పటేల్, భూమ్యల్ చేయాలి. ఇప్ప ఆకుతో దొప్పలు కుట్టి దొప్పకింత నూనె పూసి నాలుగు నూకలేసి తల్లుంగ్ ముత్తి, మార్రై షేడో (పోచవ్వ తల్లి, మారమ్మ) లకు మొక్కుతరు. అక్కలు తప్ప అన్నలందరూ పోవచ్చు. ఆనాడు పొలంలోనూ, అడవిలోనూ ఎవరూ ఏ పనీ ముట్టుకోరు. ఊరులోని మంచి, చెడు, పంచాయితీలన్నీ చూసుకుంటారు. పనుల ఒత్తిడి ఉంటే వర్షాకాలంలో పోల్వ చేయడంలో కొంత ముందూ వెనుక కావడం ఈ మధ్య మొదలైంది.

పోల్వ జరుపడం మాడియా గోండుల సాంప్రదాయం. పోల్వ వాయిదా వేయాలన్న పటేల్ ఆలోచన గోటుల్ ముందు కూడిన ఊరివాళ్ళందరికి చెప్పాలనీ భూమ్యల్ సన్నో, పుస్లా ఇంటి కడప దాటాడు. కలుస్తున్న వారందరికి వచ్చేవారం 'పోల్వ' అన్న కబురు చేరవేస్తూ నడుస్తున్నాడు.

.... .... ....

దళం ఊళ్ళో అడుగుపెట్టింది. దారెంట నడుస్తున్న దళానికి కనుచూపుమేర

ఊరి పొలాలు కనపడుతున్నాయి. పొలాలమధ్య అక్కడక్కడ చిన్న చిన్న గుడిసెలు ఉన్నాయి. వంద కడప ఉన్న ధీకొండలో ఆ మాత్రం పొలాలుండటం విశేషం ఏం గాదు.

అయితే భూముల్లో ఎక్కువ పట్టాలు లేనివే. అడవి చట్టాలను లెక్క చేయ కుండా కనీస బ్రతుకుదెరువు కోసం 'అన్నలు, వచ్చాక నరుక్కున్నవే ఆ పొలాలు. 1981కి ముందు నరుకున్న భూములకే పట్టాలంటూ సర్కార్ ఖానూన్ చేసింది. దానితో ఈ భూములకు పట్టా దొరికే ప్రసక్తే లేదని రైతులందరికి తెలుసు. 'పట్టా లేకున్నా, పంట తీసేటోనికి పట్టాతో ఏంపని,' అన్నలొచ్చినాక భూములొచ్చినయి. జంగలోడు వచ్చుడు అడుగడు కూడ బందయ్యింది. సర్కారుకి అడిగే దమ్ము లేదను కుంటూ జనాలు ధైర్యంగా పొలాలు ఖాస్తు చేసుకుంటున్నారు. గతంలో తమకున్న భూములతో ఒప్పూట గడవడమే గగనమయ్యేది. ఇపుడు కాలం కలిసొస్తే ఓ పూట తిండి దొరక్కపోదు.

భూములకు నీటి సౌలాత్ లేదు. పట్టాభూమి చూపిస్తేనే చెరువులు - కుంటలు మంజూరు చేస్తామని కలెక్టరు తెగచెప్పిపోయాడు. పాత భూములే అంటే, పి.ఓ.ఆర్ లో లేవనీ, పట్టాలు పుట్టవు. కొత్త భూములకు పట్టాలు దొరకవు. మెడకు పెడితే కాలుకు, కాలుకు పెడితే మెడకు అన్నట్టు ఇరుకనియ్యకుండా, కొరుకనీయకుండా ఉంది సర్కార్ వ్యవహారం అన్నది రైతులందరికి తెలిసిన విషయం.

పొలాలు దాటుతున్న దళానికి మొదట బారే వాళ్ళ ఇండ్లు కలిసినాయ్. ఆ గడ పల్లో నిలబడ్డ అమ్మలక్కలు దళాన్ని మొదటిసారే చూస్తున్నట్టు చాటంత కళ్ళు చేసు కొని చూస్తున్నారు. "రాం! రాం! బాయి" అంటూ దళంలోని మహిళా కామ్రేడ్స్ పలకరిస్తుంటే అమ్మలక్కల ముఖాలు ముసిముసి నవ్వుల్తో వెలిగిపోతున్నాయి. ఆ ఇళ్లను దాటి దళం కమ్మరి 'బూసరి' కొలిమి దగ్గరికొచ్చింది. 'బూసరి' నాగళ్ళుసవరిస్తు న్నాడు. ఇక్ష్వాకుల కాలం నాటి తిత్తి పొయ్యికి బూసరికొడుకు 'బిచ్చంగ' తిత్తికొడు తున్నాడు. మూరెడు నాగలికి జానెడు కర్రు పెట్టి తరతరాలుగా అదే దున్నుడయితే ఏం పంట వస్తుంది? 'కండెడు (క్వింటాల్‌నర) అలికితే కండెడు రాలడమే గొప్ప'. మగ పుబ్బల్లో అలుకుల్లు పూర్తయితే మాడియా జనం మహారాజులే. ఎవరో నూటి కొకరు, కోటికొకరు నాటువేయడం, ఎరువులు చల్లడం లెక్కలోది గాదు. నూటికి తొంబై మంది యవుసాయం అంతా ఆ తాతముత్తాతల తీరే. అలకడం మినహా

కలుపు తీయడమే తెలియదు. పెరట్లో మక్కజొన్న కలుపుతీయడమే బ్రహ్మవిద్య. నీటి పారకం అసలే సున్న. ఇక ఇలాటి వ్యవసాయంలో పంటలెలా రావాలి అందుకే అదనంగా ఎంత భూమి సరుక్కున్నా బతుకు గడవడం అంతంతమాత్రమే.

కమ్మరి బూసరి కొలిమి దాటి దళం అంగన్‌వాడి రమాతాయి ఇంటి ముందు నుంచి పోతూంది. అందరి చూపులటు తిరిగాయి. "ఉందా అంగన్‌వాడిబాయి" అంది జైనీ నడుస్తూనే. ఆమె ఉంటే తినడానికి పిండి పంపిస్తుందని అందరి ఊహాలోనూ మెదలకపోలేదు. గత రెండేళ్ళగా ఈ అంగన్‌వాడీలు ప్రారంభించింది సర్కార్. మహిళలనే ఈ పనికి పెట్టుతుంది సర్కార్. పిల్లలందరిని ఓపిగ్గా కుప్పవేసి వారికి పిండి పెట్టి, వాళ్లకు దేశభక్తి గీతాలు, దైవ ప్రార్థనలూ నేర్పాలి. స్త్రీలయితేనే ఇదంతా ఓపిగ్గా చేస్తారని వాళ్లకే పెడుతున్నారు. ఎంతో పోషక శక్తిని సమకూరుస్తుందనీ ప్రభుత్వం పెద్దగా బొంకిస్తుంది. అన్న గాండ్ల పుణ్యమా అనీ ఇవన్నీ తమ వాకిట్లో వాలుతున్నాయనీ' పిండి బుక్కే పిల్లలకు, గర్భిణీ స్త్రీలకు ఎవరూ చెప్పకుండానే అర్థమైపోతుంది.

మరో నాలుగు అడుగులు వేసేసరికి దళానికి రెడ్డిగాండ్ల ముత్తయ్య ఇల్లు ఎదురైంది. అక్కడి కొడిపె వాగయ్య నోటికొచ్చినట్లు తల్లీ అలిని మునుంపెట్టి షాపుకారిని దీవిస్తున్నాడు. 'కార్డుమీద ఇచ్చే రెండుకిలోల బియ్యం, అర్ధకిలో శర్కర, అర్థకిలో నూనె నెలనెలా ఇవ్వకుంటే నీ మొగుడి సొమ్మనుకున్నావా' అన్నది మొదలు బూతుల పంచాంగం విప్పేస్తున్నాడు. రెడ్డిగాండ్ల ముత్తయ్య మొగం మీద నెత్తురు చుక్కలేదు. నాటికాలమైతే ఈ పాటికి కొడిపె వాగయ్య వీపు ఏమయ్యేవోగానీ ఇపుడు పాదై ఉళ్ళో సంగాలాయె – అడవిలో అన్నలయిరి. ఇది షాపుకారి అసలు పీకుడు.

"ఏం వాగు మామ. మళ్ళీ ఎప్పటాటే అయ్యిందా షాపుకారి దండా" అంటూ ముందు నడుస్తున్న పైలట్ డుంగ పలకరించాడు. గతంలో 'ఒకసారి కోటా అంతా దొంగతనంగా అమ్ముకున్నాడనీ వెయ్యిరూపాయలు దండగవేసి ముక్క భూమికి మూరెడు రాయించినప్పటికీ వీనికి బుద్ధిరాకపాయె' అనుకుంటూనే డుంగ సాగిపోతున్నాడు.

గల్ల పెట్టెముందు కూచున్న ముత్తయ్య పబ్బతి పట్టి ఒక్క దుముకు దునికి

నడివీధిలోకి వచ్చి "అన్నలందరికి-అక్కలందరికి శరణార్థి" అంటూ అచ్చు తెలుగులో మొక్కాడు.

"ఛా! లంజాకొడుకా" అంటూ నీ మొక్కుడు కూడ పాపమే అన్న ధోరణిలో వాగయ్య దళం వెంట నడిచాడు.

"ఏం వాగయ్య అంతా మంచిదేనా" రుషి ఆప్యాయంగా పలకరించాడు.

"ఇంగో దాదా" అంతే ఆప్యాయంగా వాగయ్య జవాబు.

"ఏం పని చేస్తున్నవు దాదా"— రుషి

"ఏమున్నది దాదా—ఎద్దా, యవుసయమా! గరీబు లంజకొడుకును. ఉన్నోళ్ళకు గీ దెవుసంలో చేతినిండా పని. కోరి (కౌలు)కి దున్నాలన్నా లాగోడి (పెట్టుబడి) పెళ్ళదు. సనుగులు లేవాయె. కూలి పైసల్తో కోటా సూకలు కొందామంటే ఈ షావుకార్లు తేరైరి. మీరుండంగా భూమి సరుక్కుందామన్నా ఎడ్లు లేక నరికేం ఫాయిదా దాద. ఇంకేం చెప్పాలి" అంటూ క్లుప్తంగా తన యాభై ఏళ్ళ అవస్థ ఒక్క గుక్కలో చెప్పాడు.

"నీ అటువంటోళ్ళు ఊళ్ళో ఎందరుంటారు దాదా? భూమి ఎడ్లు లేక కూలి మీద బ్రతికేటోల్లు" అంటూ కమాండర్ వాకబు చేశాడు.

"ఇంటింటికి పుట్టిపొయ్యి అన్నట్టు కూలోల్లు లేకుండా ఊరేడ ఉంటదన్నా. ఈడో పదిండ్లున్నయి" అని తేల్చి చెప్పాడు నాగయ్య.

నడుస్తున్న దళానికి నేతగాని (మాల) సోమయ్య లాల్ సలాం అంటూ ఎదురు వచ్చాడు.

'అన్నలు రాక చాలా రోజులవుతుంది. ఈడ నా యింటి కాడ ఆగి ఛాయ్ తాగి పోవాలంటూ' ఆహ్వానించాడు.

"దాదా చక్కెర కిలో పదమూడు రూపాయిలుంది. ఇంత మందికి పావుకిలో కావాలి. ఛాయ్ అవసరం లేదు" అంటూ గాండో వెంటనే అనేశాడు.

గాండో జవాబుతో జైని 'హమ్మయ్య' అనుకుంది. కానీ గిరిజ మాత్రం 'గాందోకు ఎందుకింత తత్తర. బంగారం లాంటి ఛాయ్ ఎందుకు వద్దనాలి' అని మనస్సులోనే అనుకుంది. సోమయ్య రుషిని మరీ మరీ బలవంతం చేస్తే దళం సోమయ్య ఇంటిముందు ఆగింది. ఛాయ్ గొడవ అంతగా పట్టించుకోని కర్వ "నేను సెంట్రీ ఉంటాను. తాగిరండి" అంటూ వాలంటరీగా ముంగిట్లో నిల్చిపోగా దళం లోపలికి నడచింది.

జైని అసలైన మాడియా కులంలో పుట్టింది. మాలవాళ్ళ గాలి కూడ సోకి ఎరగదు. అంటు ముట్టు జాస్తి. ఆదివాసీలెవరైనా నేతగాని వారిని ఇళ్ళల్లోకి రానివ్వరు. వాళ్ళ ఇళ్ళల్లోకి పీరు పోరు. పెనుకటివారైతే సీడసోకనిచ్చేవారుకాదు. ఆదివాసీలు నూతి నీళ్ళు తోడిస్తేనే మాదుగులకు మాలలకు తాగడిక్కు. సంఘం పుట్టి అంటు ముట్టు లేకుండా నియ్యత్ పాటించకుండా పాడు చేస్తున్నదని గ్రామ పూజార్లు, పెద్దల ఏడుపు. గాండో జవాబుతో బతికిపోయాననుకున్న జైని కమాండరే ఆ ఇంట్లోకి నడవడంతో సందిగ్ధంలో పడింది.

గిరిజకి మినహా అక్కలందరికి విషమ పరీక్షలా ఉంది. తాము ఇంటివద్ద ఉండి సంఘం పనిచేస్తూ క్యాంపెయిన్‌లు చేసి ఇంటికొస్తే పసుపునీళ్ళు చల్లిగానీ లోనికి రానిచ్చేవారు కాదు తమ అయ్యా అవ్వలు. కొన్నాళ్ళ దళంలో తిరిగి అనారోగ్యంతో ఇంటికి చేరిన ఘరిస్‌బాయిని ఇప్పటికి వంట దగ్గరికి రానియ్యరైరి. ఆ పాత తరం ఏ తప్పుపడుతుందో అన్న బెంగ అక్కల ముఖాలపై నీడలా పాకింది.

"బారీ ఆమో" (ఏంగాదు) అన్న గాండో మాటతో వారికి కొంత ధైర్యం చిక్కింది. గాండో తమ కులస్తుడే. ఆయనకు లేని కుల తప్పు మాకెందుకు? అని ఎవరికి వారే సమాధానపడ్డారు. ఆ ధైర్యమే ఛాయ్ కప్పు తీసుకోవడానికి ధైర్యం చూపింది.

గోటుల్ నుండి ఇంటి దారి పట్టిన ఘామ్యల్ సన్నో అటుగా వస్తూ పల్‌కక్ర (పండ్లపుల్ల) రెండుగా చీరి నాలుకగీరుతున్న రుషి కంటపడ్డాడు.

"ఏక ఘామ్యా? ఎక్కడి నుండి?" రుషి

"ఇంటికే దాదా. లాల్‌సలాం. ఆదివారం కదా! పోల్వ అనుకున్నం. కానీ పటేల్ ఇవ్వాలటికి దున్నుకుందాం ఉంటే గోటుల్ కాడి నుండి అందరం లేసి వస్తున్నం" అని వివరణ ఇచ్చాడు.

"దాదా మరి మనం మీటింగ్ పెట్టుకోవాలి గదా! అందరు రావాలి. కబురు ఇవ్వు" అంటూ రుషి బాధ్యత అప్పగించాడు.

"ఇంకేం పోల్వ అయినట్టే. ఇవాళ పనికి పోవడం కుదరదు. ఎలాగు అన్నలొస్తే వారి వద్దనే కాలం గడుస్తుంది. ఇవాళనే పోల్వ చేస్తే రెండు కలిసి వస్తాయి. పైగా మరోవారం పని వృథాగాకుండా ఉంటుంది" అని తనలో తాను తీర్మానించుకున్న సన్నో గిరుక్కున పెనుతిరిగాడు.

వెనుతిరిగిపోతున్న సన్నోను చూసి కమాండర్‌లో తళుక్కున ఒక ఊహ మెరిసింది.

వంగిన మెడలు, నెరుస్తున్న తల, బక్కపల్చటి ఆకారం, ముడుతలుపడ్డ శరీరం, పీక్కుపోయిన కళ్ళు, ముక్కుమీద జారిపడుతున్న అద్దాలు, లోతుకుపోయిన దవడలు, ఉబ్బినరాలు తేలిన పిక్కలు, రొండ్లు లేని పిర్రలు, పెయ్యిమీద బరిబద్ద బొక్కలు లెక్కపెట్టొచ్చు, కట్టెపుల్ల చేతులు అలా యాభై దాటిన సన్నోను చూస్తూ అతనిలో తన రూపం ఊహించుకున్నాడు. కేవలం అద్దాలే మినహాయింపు తప్ప అలాగే కనిపిస్తుందా తన వాలకం అని అనుకున్నాడు. 'ఇరవయేళ్ళ ప్రాయమందునా అరుపైఏళ్ళ వయసొచ్చెనా' అని తాను అపుడపుడు పాడే చరణాలు తనకే వర్తించవు కదా అని గతుక్కుమన్నాడు.

ముప్పయో పడిలో పడుతున్నాననే తలంపు ఈ మధ్య తరచు పలకరించి పోతుంది. ప్రజాసేవకు అంకితమయ్యాక యిక 'ఆడపొందు ఆశ కూడనా' అన్నట్టు విరాగమో, సమాధానమో తెలీని ఒక నీలినీడ మనసుతో అపుడపుడు దోబూచులాడుతుంది. ముసురుతున్న ముసలి ఆలోచనల్ని విదిలించుకుంటూ ఛాయ మీదికి ధ్యాస మళ్ళించిన రుషికి పెరట్లోని జొన్నపంట మీద దృష్టి పడింది.

సోమయ్య పెరట్లోని మక్కజొన్న ముందే ఎత్తినట్టుంది. నిరుడు ముసుర్లు అధికమై మక్కపెరళ్ళని జాలుపట్టి ఎర్రబారి పలుచగా పీకలా పెరిగి బలహీనమైన కంకులేసి విత్తులేసెట్టలేదు. కానీ ఈ యేడు ఇప్పటికీ వర్షాలు ఓ మాదిరిగా వుండటంతో వయసు పిల్లలు ఎదుగుతున్నట్లు కర్ర ఏపుగా బలంగా పెరుగుతుంది. వరిఅలుకుడు, నారేతలు కానివ్వడానికి తొందరపడుతున్నారు రైతులు. ఎవరో చెప్పాల్సిన అవసరం లేకుండానే మూడేళ్ళ కరువు రైతుల్ని హుషారు చేస్తుంది. విజ్జపండుగ (విత్తనాలు అలికే పండుగ) చేయనిదే అసలు భూమిలో విత్తువేయరు ఆదివాసీలు. కానీ, ఈ యేడు ఈ పట్టింపులేవీ చెల్లవనీ ఆ పండుగలు, మొక్కుబళ్ళు ఓపిగ్గా తరువాత చేసుకోవచ్చునని తీర్మానించుకున్నారు. ఊళ్ళోకి ఇతర కులస్తులు పోల్వానాడు పొలం పనులకి, అడవి పనులకి పోతే మాడియా పెద్దలు దండుగలేసేవారు. కానీ, ఈవేళ పోల్వాలే వాయిదా వేసుకుంటున్నారు. అవసరాలే అన్ని మార్పుల్ని ముందుకు తోస్తాయి.

దీ కొంచెం పెద్ద ఊరు. నూరిళ్ళకు పైగానే ఉంటాయి. ఎప్పుడూ ఓ పంచా యితీ ఉండనే ఉంటుంది. అందులో పంచరంగుల ఊరు (నానా కులాలు) అయితే మరీనూ. 'ఆదివాసీ కిసాన్ షేక్ మజ్దూర్ సంఘటన' ఊళ్ళో చురుగ్గా పని చేస్తు న్నప్పటి నుండి గతంలో భూమ్యల్, పటేల్ చేసే పంచాయితీలన్నీ సంఘం వైపు మళ్ళాయి.

ఈ పంచాయితీలు, సంఘమూ తప్ప ఇంటిమీద ధ్యాసే లేకుండా పోతుందనీ, మరో పని ఏదీ పట్టించుకోవడం లేదనీ సంఘనాయకులు ఇళ్ళల్లో ఒకే పోరు. పోలీసుల దృష్టిలో పడ్డవారైతే ఇంటిపట్టున ఒక ఘడియ కూడ ఉండరు. అయితే జైలు, లేకుంటే లాకప్పు. ఈ రెండూ కాదంటే వాయిదాలకు (కేసు) ప్రయాణం కట్టడం. ఇవేవీ లేకుండా అదృష్టం కొద్దీ ఏనాడైనా ఇంటిపట్టున ఉంటే ఆ రోజే ఏదో ఓ పంచాయితి తగుల్తుంది. సంఘం పెద్దలయ్యాక యిక ఆలుపిల్లలతో గడప డమే లేకుండా పోయిందని వారు మొత్తుకుంటున్నారు.

.... .... ....

దళం వచ్చిందన్న కబురు విన్న గ్రామస్తులంతా సంగంలో తెగని పంచాయి తీలు అన్నలముందు తెంపుకోవచ్చనీ సంతోషించారు. ఊరి సంగంతోనే అన్ని పంచాయితీలు చేసుకోవాలనీ, పంచాయితీలు దళం చేయదనీ ప్రతిసారి ఎంతగా నచ్చ చెప్పిన మామూలుగా సంఘంలో తెగని పంచాయితీలు అన్నలే చేయక తప్పదని పూరందరితోపాటు సంఘనాయకులకూ ఉంటుంది. అలా ఒకటో, రెండో తప్పనిసరిగా మీదపడక తప్పదనీ దళానికూడ తెలుసు. అలా అప్పుడే రెండు పంచాయితీలు తయారుగున్నాయి. అందులో ఒకటి

పుంగాటి కనుకో బిడ్డ ఆకులు తెంపిన డబ్బులు మొగనికి తెలవకుండా, అవ్వదగ్గర చాటుగా దాచుకున్న కేసు పెట్టె, పేడా లేని సంసారం కదా. బిడ్డ ఇచ్చిన డబ్బులు ఎక్కడ దాచాలో అర్థంగాక తల్లి ఆ నోట్లను ఇంటి చూరులో చెక్కింది. మూడు మాసాల తర్వాత చూరులో చేయిపెట్టి చూస్తే తల్లికి నోట్లు కట్టిన గుడ్డ ముల్లెకు బదులు మెత్తటి మట్టిపెళ్ళలు తలిగేసరికి గుండెలదరసాగాయి. ముచ్చెమ టలు పోశాయి. చెదలు తినగా ముక్కలు ముక్కలైన నోట్లు చూసేసరికి తల్లీ బిడ్డల మొత్తుకోళ్ళు, తల బాదుకోవడాలు, దీవెనలు, శాపనార్థాలు మిన్నంటాయి. బిడ్డ తల్లిని

సతాయిస్తుంటే, తల్లి తన ఖర్మని, దేవున్ని తిట్టుకుంటుంది. తన డబ్బు ఎలాగైనా సరే ఇచ్చితీరాలంటుంది బిడ్డ. ముసలిదాన్ని నేనేలా చావాలంటుంది తల్లి. గోటుల్ ముందుకు వచ్చింది తగువు. ఆ తల్లీ కూతుళ్ళ సంఘం వారికి పెద్ద తలనొప్పి అయ్యారు. 'దాచుకున్న డబ్బు దానికి ఇవ్వకపోతే ఎలాగే' అంటే 'చెదలు తింటే నేనేం చెయ్యాలి దాని చూర్లనే అయితే మాత్రం చెదలు పట్టయూ, ఆ నోట్లే తీసు కోసి' అంటుంది తల్లి. 'ముసలిది నీ పైసలు తినలేదు కదా దాన్ని సాధించి ఏం లాభం' అంటే 'అదంతా నాకు తెలియదు. నా పైసలు నాకు కావాలంటుంది కూతురు 'అప్పోసప్పో చేసి బిడ్డకివ్వు' అంటే 'ననేమిదా కాద'ంటుంది తల్లి. 'నేను వదల' నంటుంది బిడ్డ. ఎటూ తేల్చలేని సంఘంవారు అన్నలముందు పెట్టారు ఈ తగువు.

అలాంటిదే మరొకటి

జూరు, లల్లీలు ఇష్టపడి పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. చాటుమాటుగా కలుసు కుంటుండేవారు. తీరా లల్లీకి మూడుమాసాల కడుపు అయ్యేసరికి ఇక ఈ చాటుమాటు సంసారం వద్దనీ, ఇల్లు దొచ్చుడే మంచిదనుకున్నారు. లల్లీ, జూరుకు ఇల్లు దొచ్చిన దగ్గరనుండి ఊళ్ళో లావరిస్ (జులాయి)గా తిరిగే "బాజీ" బుర్రలో పురుగు తొలు స్తుంది. ఏ ఇంట్లో ఏం జరిగినా పుల్లలు పెట్టడానికి తయారయ్యే బాజీ ఒక మధ్యా హ్నం జూరు ఇంట్లో లేనపుడు మంచానపడ్డ అతనికాక "పర్దేశీ"తో లల్లి ముచ్చట తీశాడు. పూటుగా తాగున్న బాజీ ఆ ఇంట్లో పర్దేశీ పెద్దరికాన్ని దెప్పిపొడుస్తూ, కావాలంటే తను ఓడే (మంత్రం) చేసి తెల్లారేసరికల్లా లల్లికి కడుపు పోయేలా చేయగలనని నోటికొచ్చినట్లు వాగడం మొదలెట్టాడు. పనీపాట లేని ముసలాళ్ళ ఇద్దరిమధ్య మాట మాట పెరిగి పందెం కాసుకునేంతవరకు పోయింది. బాజీమంత్రం పారితే పర్దేశీ వందరూపాయలిచ్చుకోవాలనీ, లేకుంటే బాజే పర్దేశీకి వంద ఇచ్చుకోవా లనీ పందెం వేసుకున్నారు. లల్లీ - జూరులకు ఈ గొడవే తెలియదు. వారంతర్వాత పర్దేశీ పటేల్ని, ఊరిపెద్దల్ని పట్టుకొని గొటుల్‌ముందు పంచాయితీ చేయించి బాజీ నుండి వందరూపాయలు ఊడగొట్టాడు. పంచాయితీదార్లు బైటక్ ఖర్చుకింద పాతిక రూపాయలు లాగేసి, మజా చేసి డెబ్బయి అయిదు రూపాయలు పర్దేశీ చేతిలోపెట్టారు. తాగిన మైకంలో అన్నమాటను పట్టుకొని అన్యాయంగా దండుగ వసూలు చేశారని బాజీ ప్రతిరోజు గోటుల్‌ముందు హంగామా చేయడం ప్రారంభించాడు. ఊరి పెద్దలు

చేసిన అన్యాయాన్ని సంఘం వాళ్ళయినా సరిచేయకపోతే అన్నలముందే ఇది తేల్చు కుంటానని బాజీ పట్టుపట్టడంలో శతగుప్తకూడ అన్నలముందుకు వచ్చింది.

.... .... ....

టీ తాగి దళం ఊరు చివరన ఉన్న నాలుగు మాదిగిండ్లుదాటి అడవిలోనికి వచ్చింది. టుగ్గె, కుల్లెలు నెత్తిపై నీళ్ళ బిందెలతో వస్తున్నారు. బోరింగ్ నీళ్ళు చిలుం చిలుం వస్తాయనీ, తాగబుద్ధికాదనీ ఊరివాళ్ళందరు నూతినీళ్ళే తోడుకుంటున్నా దళం మాత్రం కావాలని ఆ బోరింగ్ నీళ్ళే మోసుకెళ్ళడం దాదలందరికి గమ్మత్తు గుంది.

మాదుగులు ఈ ఊరికి ఈ నడుమనే వచ్చిండ్రు. కూలి, నాలి చేసుకోవటం, చచ్చిన పశువుల తోల్లుతీసి చెప్పులు కుట్టి బ్రతకడం వీరి కులవృత్తి. పేత (వ్యవసాయం) పనుల్లో ఆదివాసీలకు మాదుగులతో అవసరం లేదు. తొండాలు ఇవ్వాలంటే అసలు మోటబావులే లేవు. తాళ్ళు, తలుగులు ఇద్దామంటే ఆ పనులు ఆదివాసీలే స్వయంగా చేసుకుంటారు. ఇక చచ్చిన పసులను మోసుకెళ్ళటం, అక్కడున్న వారికి చెప్పులు ఇవ్వడంలాంటి పనుల్లోకూడ వీరి అవసరం అంతంత మాత్రమే. కూలి నాలిచేసి బ్రతకడం వీరికి మిగిలింది.

అడవి బందుకున్న ఖేతుల్ వద్ద దళం ఆగింది. ఆ ఖేతుల్ పోలీసుపటేల్ పుష్లా తమ్ముడిది. గడ్డి కొరతతో ఇబ్బంది పడలేక ఈ యేడే రెండువేల రూపాయలు పెట్టి వెయ్యి బెంగళూరు పెంకలు తెచ్చి కప్పాడు. ఆ ఖేతుల్లో సగంవరకు ఏవేవో దినుసులతో నిండి ఉండిన "విటిమ" (మల్లె)లు ఆక్రమించాయి. ఆ ఖేతుల్ వాలకం చూస్తుంటే మోతుబరి రైతుదిగా సులభంగా గుర్తుపట్టవచ్చు. ఖేతుల్‌లో విడిది చేసిన దళ సభ్యులు ఎవరి స్థలాలు వారు చూసుకున్నారు.

గ్రామస్తులు వచ్చేలోగా ఎకౌంట్స్ పని పూర్తిచేసుకోడానికి కూచున్నడు కమాండర్. దళం జమా, ఖర్చులు మూడు మాసాలకొకసారి పై కమిటికి పంపాలి.

ఊల్లె, టుగ్గె, కుల్లె, బొడ్డలు గాండోమ్ముందు కూచోని మరాఠిలా అ, ఆ లు దిద్దుకుంటున్నారు. గొడ్డలిపట్టిన చేతులు బలపం పట్టడానికి అలవాటు పడుతున్నాయి.

కర్ప- డుంగలు టిన్ బాంబులు, బ్యాటరీ సెట్లు తీసుకొని సెంట్రీ పోస్టుకు బయలుదేరారు.

మూర మాత్రం నిద్రలేమితో పార్తీన్ ఒడిలో పడిపోయాడు.

జైని, మిర్కో, సీదోలు దుప్పటులు తీసుకోని తలతో కుస్తీపట్లకు సిద్ధమైనారు. వర్షాకాలం తలలో పేనులతో మహా అవస్థ. ఎంత చుండు కట్టినా చలికాలం, ఎండాకాలం మేలనిపిస్తది. గిరిజ మాత్రం చేతిలో పుస్తకంతో ఖేతుల్లోని వంటగది వైపు దారి తీసింది. క్షణంలో రెండురోజుల క్రితం నానపోసిన ఇప్పపూలు బాగా పులిసిపోయి కల్లు గబ్బుతో ముక్కు పుటలదిరి పోగా అక్కడ కూచోలేక మరు క్షణంలోనే గిరిజ మళ్ళీ అక్కల దగ్గర చేరింది.

కల్లు గబ్బుతో తల తిరిగి పుస్తకంమీద మనసు నిల్వని గిరిజ 'ఛాయ్ చేద్దామా' అంటూ నెమ్మదిగా జైనిని కదలించింది.

మాల వాళ్ళ ఇంట్లో ఛాయ్ తాగినందుకు ఇంకా మనసు పీకుతునే ఉన్న జైనికి 'దాదలు దావ తెస్తరేమో' అని ఉంది. 'దావ తెస్తరేమో అక్కా, అయినా కమాండర్ నడుగుదాం" అని తుంచేసింది జైని. ఛాయ్ గురించి ఎవరైనా అడిగితే బాగుండునని కోరుకునే గిరిజని ఆ విషయం ఎప్పుడూ తనే కదుపాల్సిరావడం బాధగానే ఉంటుంది. కాని ఎప్పుడూ తానే బయటపడుతుంది గిరిజ. ఖేతుల్ గుమ్మంలోకి రాగానే దూరాన ఊరివాళ్ళ వస్తూండడం కనిపించింది. 'ఇక ఈ పూటకు ఛాయ్ బందే' అనుకుంటూ బయటకు నడిచింది.

దూరం నుండి వస్తున్న ఘూమ్యాల్ సర్నో, పోలీసు పటేల్ పుస్లా వెంట కొందరు జనాలున్నారు. వచ్చి రాగానే అందరూ "రాం! రాం! లాల్‌సలాం" అంటూ చేయెత్తి పలకరించారు.

"హూండా (అందరికి) లాల్‌సలాం" రుషి చేయి లేపి బదులు చెప్పాడు.

గ్రామస్తులు ఎవరికి వీలైన స్థలాల్లో వారు కూచున్నారు. ఘూమ్యాల్ సర్నో తన జేబులోని కరపత్రాలను చేతిలోకి తీసుకొని కమాండర్ కూచున్న పార్తీన్ పీటులోనే కుడివైపు కూచోగా పటేల్ ఎదురుగా చిన్న బండ తొంపు చేసుకొని కూచున్నాడు. పంచాయితి జనాలు ఎదురుగా చెట్టుకింద కూచున్నారు. వర్షం ఆగిపోయినా చెట్ల ఆకుల నుండి నీళ్ళు బొట్టు బొట్టుగా రాలుతున్నాయి. వాటిని ఎవరూ పట్టించుకోవడం లేదు. స్త్రీలందరూ కొంత దూరంగా నిలబడ్డారు.

వాళ్ళల్లో పెళ్ళి అయినవారు, కానివారు, పిల్లలు కూడ ఉన్నారు. పిల్లలెవరికీ ఒంటిమీద మొలతాడు కట్టు మినహా మరేమీ లేదు. పెళ్ళి అయిన స్త్రీలు మొలకు ఒక

టవల్ చుట్టుకోని, రొమ్ములు కప్పుకుంటూ ఛాతిపై రెండు చేతులు అడ్డుపెట్టుకున్నారు. కూచునేటపుడు టవల్‌లోనుండి ముర్వగెత్తె (లోపలి గోచి) అగుపడకుండా ఛాతిపై నుండి చేతులు తీసి టవల్ అంచులు దగ్గరగా పట్టుకోని ముడుకులు అనించి ప్రయాసపడుతూ కూచున్నారు. ఆ అవస్థ చూసి కలతపడ్డ గిరిజ మూలుగుతున్నట్టు పెద్దగానే నిట్టూర్చింది.

అప్పుడే అక్కడికి వస్తున్న జైని అది విని గిరిజ వీపుమీద చెయ్యి వేసింది.

"మా మాడియా శేడోల అవస్థ ఇలాగే ఉంటుందక్కా ఒంటినిండా గుడ్డ కప్పుకోవాలంటే అది కూడ రీతి, రివాజులకు వ్యతిరేకమేనని రాయిద పెడుతారు యిక్కడ కోయతూరు" (మగాళ్ళు) అంటూ నువ్వేం ఆలోచిస్తున్నావో నాకు తెలుసులే అన్నట్లు మొదలెట్టింది జైని.

"నిజమే జైని, కానీ పెళ్ళి కాకముందు అందరూ ఎంచక్కా డ్రాట్లు వేసుకోని, చీర కట్టుకోవడం లేదా. ముక్కు పుల్లలు, చెవుల కమ్మలు, మెలగొలుసులు కూడ పెట్టుకోవడం లేదా ! మరి తీరా పెళ్ళి అయినాక ఒంటినిండా బట్టకూడ లేకుండా యిలా వికారంగా తయారైతే చూసే కోయతూరుకు మాత్రం బాధగా ఉండదా! ఎవరు ఎందుకు ఎదురు తిరగరు?" అంటూ ఆవేశంగా ఉపన్యాస ధోరణిలో పడింది గిరిజ.

"అయ్యో అక్కా ! ఇన్నాళ్ళయి ఇక్కడే తిరుగుతూ మా అక్కల్ని ఇవాళే చూస్తున్నట్లు దీనికే ఇంత బాధ పడిపోతావు ఎందుకు" అంటూ గిరిజను దెప్పుతూనే సంబాళిస్తున్నట్లు జైని చెప్పుకపోతుంది.

"ఒంటినిండా కప్పుకోనీకి బట్ట ఇవ్వకపోవడమే ఓ కష్టమూ, అవమానమూ అనుకుంటే 'బాయి'ల బతుకే ఇక్కడ ఓ పెద్ద అవమానం. ఎక్కడు ఎవ్వ పడేస్తే 'ఛీ' అన్నా, 'ఫో' అన్నా తోకాడించుకుంటూ కడపలో పడి ఉండే 'నై' (కుక్క) లాగా పెళ్ళి అయిన గొట్టెది పడేసేడు మెతుకులు తిని అన్నిటికి ఓపించుకుంటూ ఇంట్లో పడి ఉండాల్సిందే కానీ అది కూడ ఒక మనిషి కింద లెక్కేకాదు. మా ఆదివాసీ ఆడోళ్ళ తిప్పలు చెప్పాలంటే రాస్తే ఓ పెద్ద కథే అవుతుంది." అంటూ ఇంకా ఏవో చెప్పబోతుంది జైని.

జైనిలో ఎవర్నో కొత్త మనిషిని చూస్తున్నట్టు గిరిజ ఆశ్చర్యంగా కళ్ళప్పగించి చూస్తుండిపోయింది. మొన్న మొన్నటివరకు ఏమడిగినా కళ్ళ నీళ్ళు పెట్టు

కుంటూ తనలో తాను ముడుచుకుపోతూండే రాగోయేనా ఈ జైని అనుకుంటూ జైనిలో పెరుగుతున్న చైతన్యానికీ, అవగాహనకూ, ధైర్యానికీ ఆశ్చర్యపోతూ ఆనందిస్తూ మెచ్చుకోలుగా ఆమె మొహంలోకి గుచ్చి గుచ్చి చూస్తున్న గిరిజ ఆలో చనలకి కమాండర్ పిలుపుతో అడ్డుకట్ట పడింది.

"గిరిజక్కా - మీ అక్కలందరూ వారి అక్కలను కూచోబెట్టి మాట్లాడండి. మేము ఈలోగా పంచాయితీలు పూర్తి చేస్తాం!" అని పురమాయించాడు రుషి.

కమాండర్ పిలుపు విని గిరిజ జైని నడుం చుట్టూ చేయి వేసి అక్కల వైపు నడుస్తూ మీనోక్క, సీవోలను కేకవేసింది.

"రాం, రాం, బాయి." గిరిజ, జైని ఏకకాలంలో ఊరి అక్కలను పలక రించారు.

"రాం, రాం" అంటూ అందరూ ముసిముసి నవ్వులతో దళ అక్కలను ఆహ్వానించారు.

అప్పటికే అక్కడ సుమారు ముప్పైమంది స్త్రీలు చేరి ఉన్నారు. నడివయసు వారు, పడుచులు, చిన్నపిల్లలు కూడ ఉన్న ఆ గుంపులో మాడియాలు, దొరెవాళ్ళతో పాటు కొద్దిమంది దోలు, పర్ధాన్, రాజగోండు, హల్బి, గోవారీలు కూడ ఉన్నారు. నలుగురైదుగురు అక్కలు మాత్రం ఈ గుంపుకు దూరంగా దాదల దృష్టిలో పడ కుండా వెదురు పొద చాటుకు తీగదారి పొదల కింది నుండి నక్కి నక్కి చూస్తు న్నారు.

"మీటింగ్ కీకా బాయి" (మీటింగ్ చేద్దామా అక్కలు) - గిరిజ.

"ఇంగో" - జనంలో నుండి జవాబు.

"ఏం చెప్పమంటారు" గిరిజ వారినే తిరిగి ప్రశ్నించింది.

"ఒక పాట చెప్పండక్క" అంటూ ఒక యువతి కోరింది.

"పాట తర్వాత అక్కా. ముందు మా జైనిబాయి ఇవాళ మీటింగ్ చెప్తాది" అంటూ టక్కున అనేసింది గిరిజ.

జైని ఉలిక్కిపడింది. ఊహించని మాట వినేసరికి తత్తర బిత్తరయింది. 'ఎప్పుడూ మాట్లాడని నన్ను గిరిజక్క ఎందుకు ఇబ్బందిలో పడేస్తుంది' అనుకుంటూ, అదేమాట పైకి అనేసింది.

"లేదు జైని. మన అక్కల బాధలు నీకే బాగ తెలుసు. ఈ రీతులు,

రివాజులు నువ్వు చెప్పగలవు. ధైర్యంగా మాట్లాడు. నేను నీపక్క ఉంటాను గదా" అంటూ గిరిజ జైనిని ముందుకు తోసింది.

"చెప్పు అక్కా ఏం గాదు" అంటూ సీపో కూడ ప్రోత్సహించింది.

చెమటలు పోసిన ముఖాన్ని చెమటలు పట్టిన చేతులతో తుడ్చుకుంటుంది. తల గోక్కుంటుంది. గొంతు సవరించుకుంటుంది. కానీ ఇన్ని చేసినా జైనికి మాట పెకలడం లేదు. చివరకు "నాకు వామో (రాదు). నువ్వే చెప్పక్కా" అంటూ గిరిజ వైపు చూసి నసిగింది.

"చెప్పంద్రక్కా. పొద్దెక్కుతుంది" అంటూ ఓ ముసలిది జనాల్లో నుండి గాబర పెట్టింది.

ఇక తప్పదనుకున్న జైని మెల్లగా గొంతు సవరించుకుంది. చూపులు పైన నిలిపి లిమ్మరుతుల గుమ్మడి, కమలక్కపాటలు గుర్తు చేసుకుంది. అయినా ఎక్కడ మొదలు పెట్టాలో తెలడంలేదు. ఒకసారి తల్లి గుర్తొచ్చింది. అంతే ! మాడియా భాషలో "బాయి" అంటూ మొదలు పెట్టింది. తన తల్లి దిన చర్యనంతా పేర్చు కుంటూ చెప్పుకొస్తుంది.

"పుంజాలు కూయంగా లేసి ఏరోజు గాసం ఆ రోజుకే అన్నట్టు వడ్లు దంచుతూ, జావ (అంబలి) గాసి పొలగాండ్లకు పోసి పొలంకాడ మొగనికి కొంట పోతది ఆడది. మొగుడు జావ తాగుతుంటేనే అది మెల్లగా పొలంలకు దిగుతది. నాగలి పట్టి మొగని దంటకు అది తీసిపోకుంటా దున్నుతది. నాగలిడిసిందంటే అడవిల పడి ఆకు, అలము జమ చేసి ఆరోజు కూర పూర్త తెస్తది. ఇంటికాడ ఆడదాని అసరా లేకుంటే ఆ ఇల్లెదుగదు. పూలు ఏరుడు, పండ్లు ఏరుడు, గడ్డలు తవ్వుడు ఇల్లు నూటొక్క పని చేస్తే గాని ఎల్లదు ఆడదాన్కి. గడియసేపు కూచో నీకి ఆరాం ఉండదు. అయినా ఆడదాన్ని అయ్యో అనేటోళ్ళవరు?" అంటూ జైని అక్కల వైపు చూపులు తిప్పేసరికి వారు నవ్వుతున్నట్లనిపించి ఠక్కున మాట ఆగిపోయింది. మళ్ళీ దిక్కులు చూసింది.

ఇంతలో "పెహ" (చెప్పు) అంటూ గుంపులో నుండి ఎవరో ఒకరు అనే సరికి "అయ్యో ఇంకేం చెప్పాలి" అన్నట్టే తడుముకోసాగింది.

"పొద్దస్తమానం పని చేసిన ఆడది నడుం లాగుతుంటే, మంచంపై నడుం వాల్చుదామంటే కూడ పోలో (పనికిరాదు) అంటారు. రివాజులు అమలు చేసే పెద్దలు

పెళ్ళయిందంటే అక్కడ నేలమీద దొర్లాల్సిందే తప్ప మంచం మీద కూచోనైనా కూచోకూడదు" అనంగానే అందరక్కలు కిసుక్కుమన్నారు.

తాను చెప్పింది ఎక్కడ తప్పిందోనని పరేషాన్ అవుతున్న జైనికి "ఇంగో, నిజ్జమే" (నిజమే) అని ఎవరో అన్న మాట 'నడవనీ' అనట్టు ధైర్యమివ్వడంతో మళ్ళీ రివాజుల్లోకి పోయింది జైని.

"ఎక్కడ లేని రివాజులూ మన ఆడవాళ్ళ మీదే రుద్దుతున్నరు. ఏం చేసుడు మీరే విచారం చేసి చెప్పాలి.

పేను (దేవుడు) పూజకాడికి కూడ మనల రానియ్యరు. సవరించేదంతా మన వంతే. కాని దేవుడికి మొక్కడానికి మాత్రం మనం పనికిరాం. ఆ దేవుడెట్ల మెచ్చుతాడో మరి! పంట చేతికొచ్చేవరకు దున్నుడు నుండి కోత వరకు ఏ పనికి మనం లేకుండా వెళ్ళదు. కానీ కళ్ళంలోకి మాత్రం రావద్దంటరు. ఆసది షికారుకు పోకుంటే కాదు అంటారు. పోయి పేట అయితే కోసే దగ్గర మాత్రం పోలో (పనికిరాదు) అంటారు".

"గడుసుపిల్లే. అన్నీ ఉన్నదుల్లే చెప్పుతుంది" అని అక్కడున్న ఆడవాళ్ళలో నుండి ఓ ముసలిది గొణిగింది. ఇది విన్న సీవో "తప్పుండే చెప్పవ్వా" అనేసరికి ఆ ముసలిది సదురుకొని నవ్వి ఊర్కుంది.

"ఇంటికాడ పని చెయ్యకుంటే అయ్య నచ్చిన లెయ్యోన్ని (పడుసోణ్ని) బిడ్డ నిస్తనని ఆశపెట్టి లామడి తెస్తరు. వానికి నేనుండనని పిల్ల మొత్తుకుంటే అయ్య వినడు. అవ్వ వినదు. గిట్టనోనితోని సంసారం చేయమంటారు. లేకుంటే ఇంట్లున్న లామడే (ఇల్లరికం అల్లుడు) ఊరుకోడంటరు. ఇదీ వాళ్ళ వరుస" అనేసరికి పెళ్ళి కాని పడుచుస్త్రీల ముఖాలు చిరునవ్వుతో వెలగసాగాయి. ఆ నవ్వులు మరింత ప్రోత్సహించినట్టయింది.

"ఏడ లెయ్య (పడుచుది) కనపడ్డా, పిల్లవోరక్క పెండ్లి కానోడు వాని బలగాన్నంతా తోలుకొచ్చి పిల్లనిమ్మని ఇంటిమీద కూసుంటరు. ఇయ్యనని మొత్తుకున్నా విడవకుండా జిద్దు చేస్తారు. బత్తెం కట్టుకొనివచ్చి 'ఇస్తాం' అనేదాక పిల్ల ఇంటిముందు ధూం, ధూం చేస్తరు. వాళ్ళ గడుసుతనం భరించలేక ఇంటోల్లు పిల్ల నిస్తామంటారు. ఇది ఇట్లయితే, వెనుకట పడచుపోరి ఒక్కతే కనపడిందంటేనే పదిమంది లెయ్యోళ్ళు (పడుసోళ్ళు) అమాంతం మీదపడి చడీ చప్పుడు లేకుండా

ఎత్తుకెళ్ళినట దాతు లేదు ఫిర్యాదు లేదు” అనేసరికి అందరు గొల్లుమన్నారు. “పెళ్ళి అయి అత్తగారింటికి పోతే బావ కంటిముందు పడొద్దు. బావ పిల్లగాండ్లను పేరు పెట్టి పిల్వద్దు. మారిపడ్డ ఆడది కూడ బావ కచ్చరం (ఎడ్లబండి) ఎక్కొద్దు. ఎక్కితే దండుగ. ఇవన్నీ బాపుబతుకులు చూడని రివాజులు. తల్లిగారింటికి వస్తే అనల్ పేను అని అంటుముట్టు పెట్టి వంటగదిలోనికే రానియ్యరు.

అపుతలున్న (బహిష్టు) ఆడదానికి ఐదు రోజులు ముట్టుడు అది తప్పిపోయి కూడ మగాళ్ళ కంట్ల పడొద్దు. దాంట్లో పూజారి కంట్లబడితే దండుగ తప్పదు. ఏం చేసినా, ఏం తప్పినా 'దండుగ' అని వేధిస్తరు ఈ పెద్దలు.

ఇంతెందుకు దసరా పండుగ వచ్చిందంటే అహిరిపోయి మహారాజా కొలువుల పడుబుపోరీలు ఎగురకుంటే ఊరిమీద దండుగా వసూలు చేస్తడురాజు. ఈ దండుగా ఎవడు కడుతడని ఊరిపెద్దలు “ఆడికిపోయి ఎగురుండ్రని” ఆడోళ్ళను తిప్పల చేస్తరు. ఆ పెద్ద ఊళ్ళె బద్మాష్ గాడిదలు మనల్ని ఏం అన్నా, ఏమి చేసినా వీళ్ళకు పట్టదు”. అంటూ జైని చెప్పుకపోతుంటే ఊరి అక్కలు శ్రద్ధగా వింటున్నరు.

“ఆడది ఇల్లు బొచ్చునంక లగ్గం (పెండ్లి) చేసుకోను పెళ్ళబాటు లేకుంటే ఈ మహారాజా తొత్తులు ఊళ్ళోళ్ళకు వచ్చ యేటా జోడికి అయిదురూపాయిలు పెండ్లి చేసుకునేదాక కట్టుమంటారు. తల్వాలు పోసుకుంటే గానీ ఈ దండుగ తిప్పల తప్ప దంటరు.

ఈ రాజులు, రివాజులు అన్ని గలసి ఆఖరికి ఆడది కోడిగుడ్డు తినకూడదనీ కూడ ఖాయిదా చేసిరి” అంటూ గిరిజ వైపు చూసేసరికి గిరిజ ముసి ముసిగా నవ్వు తుంది.

“చాలా బాగ చెప్పావు జైని” అని మెచ్చుకుంటూ గిరిజ ఊరి అక్కల వైపు చూసి

“జైనిబాయి చెప్పినవన్నీ నిజమేనా—అక్కలా” అంది.

“హా” అన్నాయి అన్నిగొంతులు ఒక్కసారి.

“మరి సంఘం పెట్టుకుంటారా! ఇవన్నీ పోవాలంటే మనం అందరం ఒక్కటి గావాలి. మన బతుకులు మారాలంటే మనం కొట్లాడాలి” అనేసరికి ఇందాక మాట్లా డిన ముసలిది అడ్డు తగిలింది.

“కోయుతూరు నడగొద్దా బాయి”—అంది ముసలిది

ఈ మాట విన్న ఆ గుంపులోని యువతులందరూ "దాదలు చెప్పినాంక కోయతూర్ ఏమంటరు. ఇంక అడుగుడేంది" అంటూ గుయ్యిమన్నరు.

"కాదవ్వా. మన కోయతూర్ అందరూ సర్కార్‌తోని లడాయి చేయడం లేదా అక్కలందరం కూడ సంగం పెట్టుకొని మగాళ్ళతో పాటు ఒక్కటై ఆ లడాయి మరింత గట్టిగ చెయ్యాలి. మన రాజ్యం మనకొచ్చి మన కష్టం మనకి దక్కేరోజు వస్తేగాని యీ బాధలన్నీ పోవు" అని మళ్ళీ ఓపిగ్గా చెప్పింది గిరిజ.

"ఇంగో కొట్లాడుదాం" అంటూ వణకుతున్న ఆ ముసలి గొంతు గట్టిగా అనేసరికి అందరూ "ఇంగో" అన్నరు.

* * *

మహిళా సంఘం పనిని అక్కలకు అప్పచెప్పిన కమాండర్ పటేల్ వైపు దృష్టి మళ్ళించాడు.

"అఁ! పటేల్ దాదా! అయితే ఇవాళ పోల్వా చేస్తున్నట్టా! వాయిదా వేస్తున్నట్టా" అంటూ ఇక మన పనిలోకి దిగుదామా అన్నట్టు ప్రారంభించాడు.

"బొ దాదా! ఈ రోజుకు ఆపుకుందామనే అనుకున్నాం. ముసుర్లు ఉండంగానే మడికట్టు పూర్తి చేయాలనుకున్నం. రైతులు తొందరపడుతున్నారు. కానీ, పనులు కూడ సరిగా నడస్తలేవు. మీరు రానేవస్తిరి. తెగాల్సిన పంచాయితీలు కూడ ఉండె. అందుకని పోల్వా చేసే వచ్చినం అంటూ ఓపిగ్గానే మీటింగ్ చేయాలన్నట్టు గుక్క తిప్పుకోకుండా చెప్పాడు పటేల్.

"మంచిదే దాదా! అలాగే చేద్దాం. అయితే పోల్వాలా - పద్ధతులు అంటూ పనులు మానుకోని పండుగలు చేసుకుంటే మనకెలా నడుస్తుంది? ఏ ఆచారాలైనా, ఏ పద్ధతులైనా మన సౌలతులు బట్టి చూసుకోవాలి. గాని ఎప్పుడో పెద్దలు చేశారు కదా అని మొండిగ పట్టుక కూచుంటే మనకే లుక్సాన్ అవుతది. మరి మనం మీటింగ్ చెప్పుకుందామా" అంటూ దూరంగా యువకులకు పాటలు నేర్పుతున్న గాండోను కేకేశాడు.

"గాండో దాదా! మీ పాటలైపోతే డోలు దాద వాళ్ళను తీసుకోని ఇటు వస్తావా! ఈ మీటింగ్ మహా చేద్దాం" అంటూ ఊరి సంఘం వాళ్ళందరిని రమ్మన్నాడు.

మిగిలిన దళ సభ్యులు, సంఘ సభ్యులు కూడా వచ్చి కమాండర్ పక్కన కూచోగానే జనం అందరు సర్దుకోని హుషారైనారు.

రుషి తన వాచి చూసుకుంటూ సంఘం సెక్రట్రీ డోలుపైపు చూసి, "పది అయింది దాదా. మొదలుపెట్టండి" అన్నాడు. బాజీ దగ్గర వంద రూపాయలు వసూలు చేసిన పంచాయితి గూర్చి చిటీలో చెపుతూ డోలు "బాజీ దాదా సంగతేదో నువ్వే చెప్పితె కాదా." అన్నాడు.

"ఇంగో దాదా" అంటూ బాజీ గొంతు సవరించుకున్నాడు.

"తాగినోడే కట్టుకున్నడు తాళ్ళ పన్ను అన్నట్టు ఆ రిమ్మలో ఒళ్ళు తెలియక వాగినందుకు నాకు మంచి శాస్తే అయ్యింది. కానీ ఊళ్ళె ఇందరున్నరు. అమకునే అన్నలున్నరు. న్యాయం విచారం చెయ్యాలి. తాగుతే ఎన్ని అనుకోం! అన్ని పట్టుకుంటామా! పైసలకాడికి వచ్చేసరికి జారినమాట పట్టుకోని ఈ ముసలోడు పర్దేశిగాడు విడువకుంటా పట్టుకున్నడు. దొరికిందే చాలనీ తిమ్మిని బమ్మిని చేసే పెద్దమనుషులు ముక్కుపిండి నూరు రూపాయలు నాతో కక్కిచ్చిండ్రు. తల తాకట్టుపెట్టి దండుగ నింపినప్పటి నుండి కల్లు పుట్టకుంటా అయ్యింది. ఈ అప్పు ఎప్పుడు తీరాలి ? నా ఉసురు ఎవరికి తలగాలి ! తేలు మంత్రం రానోడు పాము పుట్టలో వేలు పెట్టినట్టు బుద్ధి గడ్డితిని నేను లల్లి ఊసు ఎత్తుడు తప్పే. నా పైసలు నాకు ఇప్పిస్తే అప్పు తీర్చుకుంటాను. ఇగ ఎవలటోలికి పోను. కిరియ" (ఒట్టు) అని ఇక ఏడుపే తక్కువన్నట్లు అందరిని ఓసారి కలయచూసి తల దించుకున్నాడు.

క్షణం ఎవరూ మాట్లాడకపోయేసరికి సంఘం అధ్యక్షుడు లెబుడు అందుకున్నాడు.

"గీ దండగలు, గుంజులాటలు లేకుంటా ఊరంతా పట్టుగుండాలనీ అన్నలు చెప్పబట్టిరి. మేము చెప్పబట్టితిమి. అయినా మీ దందా మీదే అన్నట్లు వినరైతిరి. ఇగ ఏం చేసుగోమరి. ఈ ముసలోని దగ్గరినుంచి దండుగ వసూలు చేసి ఆ ముసలోనికి ఇప్పిచ్చి బైటకు కింద ఇంత మిగిలించి కల్లుకాగి బొత్తలు నింపితిరి. ఇగేం లేదు. తాగిన డబ్బులు పెద్దలు కట్టుండ్రి. మిగిలినవి జూరు కాకగాడు పర్దేశి ఇయ్యాలే. లావరిస్ బాజీ లల్లి ముందు ముక్కునేల రాయాలి. మల్లోసారి ఇటువంటి జాగతాలు చేసుకుంటే మాత్రం మంచిది గాదు" అంటూ లెబుడు కోపంగా ముగించాడు.

"ఇంగో గట్లనే చెయ్యాలి వీళ్ళకు" అని కొందరంటే, "ఈ పెద్దలు దండగ

తిరిగి కడుతారా" అని అనుమానం లోపల ఉన్నా "కట్టాలి మరి" అని మరికొందరు "గిట్లయితేనే మళ్ళీ జోలికి రారు" అని ఎవరో ఇలా తలా ఓ మాట ఆ గుంపులో నుండి అనేశారు. మొత్తంపై ఆ పోడి మాటలు సారాంశంలో లెబుడు చెప్పిందానికి "ఇంగో" అన్నట్టే ఉన్నాయి.

"గైకు! గైకు" (కొద్దిగ....కొద్దిగ) అంటూ రుషి కలిగించుకునేసరికి ఆ కలకలం ఆగింది. "లెబుడు దాదా చెప్పింది ఏమనుకుంటున్నరు దాదా" అని రుషి జనంపైపు చూశాడు.

నిశ్శబ్దం.

"అట్ల చేస్తేనే మంచిదని మాకున్నది. కానీ, ఈ తాగి బొత్తలు నింపి నోళ్ళ మళ్ళీ డబ్బులు కట్టాలంటే అది కానిమాట. అట్లాగాకుండా ఇసొంటి లంగ పంచాయితీలు మళ్ళీ చేయం. తప్పయింది. ఖర్మకాలి ఎవడన్నా వచ్చినా ఆండ్ల వేలు పెట్టమనీ ఈ పెద్దలు ఇంతమందిలో చేసిందేదో తప్పయిందనాలి. ఇక బాజీ ముక్కు భూమికి రాసుడు. పర్దేశీ డబ్బులిచ్చుడు అమలుచేయాలి. ఇంతకు మించి దీంట్లో ఏం లేదు" అని రుషి ముగించేసరికి అందరూ తృప్తిగా "ఇంగో" అన్నారు. పెద్ద మనుషులు లోలోపలే 'ఇదే మంచితోవ' అనుకున్నారు.

అంతసేపు ముళ్ళమీద కూచున్నట్టు కసుకో తల్లి రుషి 'అయిపోయింద'నడం తోనే గబుక్కున బొడ్లో నుండి పైసల సంచి తీసి అతని చేతిలో పెట్టింది. దాంట్లో నుండి ఆ నోట్లను వెలికి తీసి చూశాడు రుషి. నాలుగు యాభై రూపాయలనోట్లు, ఐదు ఇరవై నోట్లు. అవి ఖచ్చితంగా మడతల్లోనే చెదలు తిని ఉన్నాయి. అవి చూస్తూనే పక్కన కూచున్న సంఘం సెక్రట్రీపైపు చూసి "ఇవి బ్యాంకులో మారు తయి దాదా షావుకారికిచ్చి మార్చి తెమ్మంటే సరిపోతుంది" అంటూ ఇందులో చెప్పాల్సిందేమి లేదని తేల్చేశాడు.

డోలు ఆ నోట్లు మడతబెడుతూంటే ఎదురుగా నిల్చున్న కసుకో ఆకాశం వైపు చేతులెత్తి దండం పెట్టింది.

"హమ్మయ్యా! ఇగ అన్నం తిందాం పదండి దాదా!" అంటూ లెబుడు తొందరచేశాడు.

అందరూ చేతులు కడుక్కోవడానికి కదల్తాంటే, ఇక ఆలస్యం చేయకూడ దన్నట్టు సన్నో కరపత్రాలను రుషి చేతిలో పెట్టాడు. వాటిని జేబులో కుక్కి

లేచి తిండివైపు నడుస్తూ "రండక్కా-బావా. భోజనాలు చేసి, తర్వాత మీటింగ్ పూర్తి చేద్దాంగాని" అంటూ అక్కల్ని కేకేశాడు.

అన్నల సంఘం నుండి ఇద్దరు, అక్కల తరఫున-ఇద్దరు, బాలల తరఫున ఇద్దరు అన్నం జమ చేసుకవచ్చారు. వాళ్ళు తెచ్చిన అన్నం, కూర, అంబలి, నీళ్ళల కడిగిన విస్తర్లందిస్తూ అందరికీ వడ్డించడం మొదలెట్టారు.

ఇల్లిల్లు తిరిగి అన్నం వసూలు చేయాలంటే పీరందరికి మొదట సిగ్గే. కొన్ని గ్రామాల్లో చొరవతో తట్టి, బుట్టందుకోని అన్నలే అడుక్కోవడంతో యిప్పుడు సంగంవారిలో ఆ జంకు పోయింది. మరికొన్ని సందర్భాల్లో 'అడుక్కొస్తేనే తింటాం, లేకపోతే తినం' అని మొండికేసి అలవాటు చేయించిన ఘటనలు లేక పోలేదు. అతిథులకు మగాళ్ళు విడిగా వంటచేసి పెట్టడమే ఆదివాసీల మర్యాద. మొదట్లో దళం పట్ల కూడ ఆ ధోరణే అవలంబించారు. 'అలా వేరుగా చూస్తే తినం' అని పట్టుపట్టడంతో గత్యంతరం లేక జనాలు ఇంటివద్ద వండుకున్న తిండిలో నుండే జమ చేయడం, అలా అన్ని యిళ్ళల్లో అడగడం నేర్చుకున్నారు. ఇంతకు ముందు గ్రామాల్లో రకరకాల పద్ధతులు అమలవుతుండేవి. కొన్ని గ్రామాల్లో అన్న లొస్తే ఊరి చౌకిదారు (ఉమ్మడి సేవకుడు) ఇంటికి ఇన్ని అని బియ్యం, ఇతర పప్పు సామాను వసూలుచేసి వండి పెట్టేవాడు. మరికొన్ని గ్రామాల్లో ముందుగానే కొన్ని బియ్యం జమచేసి వుంచి దళం వచ్చిననాడు కోస్కూర్ (సర్కార్ మను షులు)కు వంటచేసి పెట్టినట్టే వండించి పెట్టేవారు. మరికొన్ని గ్రామాల్లో దళం రాగానే ఊళ్ళోని దుకాణం నుంచి ఆ పూటకు అవసరమైన సరుకులు ఊరిపేరుమీద కొని వంటచేసి పెట్టేవారు. షావుకారి బాకీ తలా కొంత వాటా వేసుకోని చెల్లించే వారు. ఇలా రకరకాల పద్ధతులుండేవి. ప్రజల తిండి తింటే వారికి మరింత దగ్గరవు తామనీ, వారి సాధకబాధకాలు బాగా తెలిసి వస్తాయనీ, అలాగే నిర్బంధం పెరిగిన రోజున ఒకే దగ్గర నాలుగు కిలోల బియ్యం వండుకొని రావడం కన్నా ఏ ఇంటి తల్లి ఆ ఇంటిమూట నెత్తిన పెట్టుకోని వస్తే ఏ పేచీ లేకుండా ఉంటుందనీ కూడా ఆలోచించి జనం వండుకున్నదే ప్రతి ఇంటినుంచి జమ చేసుకురావాలనీ, దళం పట్టు పట్టి అలవాటు చేసింది.

ఒక గంజులో అన్నం, మరో గంజులో కూర, సర్వ (బిందె)లో అంబలి జమచేసి తెచ్చారు. సెంట్రీలు పోను 11 మంది విస్తర్ల ముందు కూచున్నారు. రేఖ

గాటో (అన్నం) పెడుతుంటే, రైతు సంఘం మాసు కుసురు వడ్డిస్తున్నాడు. బాల సంఘం పొరిమ నీళ్ళందిస్తున్నాడు. తిళ్ళు కొనసాగుతున్నాయి. మలేరియా మందు చల్లే మేస్త్రీ దళాన్ని కలుస్తానంటే మూడు గంటలకు రమ్మన్నానని మాసు రుషికి చెవులో కబురు చెప్పాడు.

"అలాగే. దళం వద్దకు నేరుగా ఎవర్నీ తీసుకరాకూడదు దాదా ! ఇవాళ రేపు పోలీసులు తీర్రైన వేషాల్లో తిరుగుతున్నరు. జాగ్రత్త గుండాలి. మరోసారి మమ్మల్ని అడగకుండా టైం ఇవ్వకూడదు దాదా" అంటూ రుషి తింటున్న అన్నంలో చెడిపోయిన గబ్బు బుక్క బుక్కకు ఎక్కువ గావడం గమనించాడు. ఎవరో తల్లి రాత్రి మిగిలిన అన్నం వేసినట్టుంది. ఎంత వేసిందో గానీ మొత్తంగా అన్నం అంతా చెడిపోయిన వాసన వస్తుంది. తింటూనే అందరి ముఖాలు చూడసాగాడు. గిరిజ మినహా మిగతావారందరూ శుభ్రంగా కానిస్తున్నారు. 'ఎంతయినా మిమ్మల్ని అందుకోవడం కష్టమే' అని మనసులోనే ఆదివాసులను ప్రశంసిస్తూ తినసాగాడు. జప చేసేపుడు జాగ్రత్తలు తీసుకుంటే ఆరోగ్యానికి మంచిదని చెప్పాలనుకొని మళ్ళీ 'యిపుడు కాదులే' అని వాయిదా వేసుకున్నాడు. జావ పరిస్థితి కూడ అందుకు భిన్నంగాలేదు. పులిసిపోయిన వాసనొస్తుంది. బలిమికి తన దొప్పలోనిది ఖాళీ చేశాడు. తెచ్చిన ప్రతిదీ ఇప్పపూలు, గుడాలతో సహా అన్నీ ఎవరి పాళ్ళు వాళ్ళు తినేస్తున్నారు.

"గిరిజక్కా అక్కలు సంఘం పెట్టుకున్నరా" అంటూ తర్వాత పని ప్లాను చేసుకోడానికన్నట్టు వాకబు చేశాడు రుషి.

భోజనం ముగించి లేవబోతున్న గిరిజ "ఆఁ! అయినట్టే. మళ్ళీ ఇపుడు కూచోబెట్టి ముఖ్యుల్ని ఎంచుకోవాలి. పంచాయితీలు అయిపోతే మీరు కూడ వస్తే మంచిది" అంటూ లేసి చేయి కడుక్కొనుపోయింది గిరిజ.

"మీరు ప్రారంభించండక్కా. మేము వస్తాం" అంటూ తిండి ముగించాడు రుషి.

గిరిజ వచ్చేసరికి మేన్‌కవడాలో కూచున్న జైని చుట్టు నలుగురు పిల్లలు, ఆరేడుగురు యువతులు చేరి పుస్తకాల్లో బొమ్మలు చూస్తూ ముచ్చట్లు పెడుతున్నారు. ఏ కొద్ది టైం దొరికినా, చెల్లెండ్లను తమ్ముళ్ళను చుట్టు వేసుకోని పుస్తకాల్లో బొమ్మలు, తూటాలు, తుపాకీ చూపెడుతూ, ఎన్నో ముచ్చట్లు చెబుతూ ఆ ప్రపం

చంలో మునిగిపోయే జైనిని చూసి గిరిజ ఎపుడూ 'పిల్లల కోడి' అంటుంది. ఆ రోజు ఆ ఊరి ఇర్పిని దగ్గర కూచోబెట్టుకోని అక్షరాలు దిద్దిస్తుంది జైని.

వాళ్ళకు కొద్ది దూరంలో కూచోని ముచ్చట్లు చేస్తున్న అమ్మలక్కల్లో నుండి మెంతక్క గిరిజను చూడగానే లేచివచ్చి చేయి కలిపింది.

"ఎట్లుందక్కా ఇపుడు. మందు ఏమైనా పనిచేసిందా"— గిరిజ

"ఔనక్కా. గోలీలు పని చేసినయ్. గజ్జిమాని కొద్దిగా నల్లబడేసరికి తగ్గిం దని గోలీలు ఆపిన. మళ్ళీ షురువైంది. మళ్ళీ తింటున్న మందులు. జెరనయమే" అంటూ మెంతక్క గట్టిగ బిగించి కట్టిన చీరను కొండి నుండి జరుపుతూ చూపింది.

"అదే అక్కా. ఏ మందైనా పూర్తిగా వాడాలి. లేకుంటే పనిచేయవు. మందులు వాడితేనే సరిపోదు. ఈ చీరకట్టు కూడ వదలుగా లేకపోతే చెమట, పుండ్ల సొన రెండూ కలసి మళ్ళీ ఎక్కువవుతుంది" అంటూ జాగ్రత్తలు హెచ్చరించింది గిరిజ.

చాటుగా నిలబడ్డ అక్కలను చూపిస్తూ "మన మీటింగ్‌కు వచ్చినపుడు అందరు కలసి కూచుంటే సరిపోతుంది కదా" అంది.

"నిజమే అక్కా. మాడియాల్లో పట్టింపు లెక్కువ కదా! మీరున్నరు కదా అని ఇవాళ అందరి మధ్యకు వస్తే రేపు మా దాదలు బాధపడతరు" అంటూ బహిష్టు రోజుల్లో మగాడి కంట్లో పడకూడదనే ఆచారం తప్పక పాటించాలన్నట్టు జవాబు చెప్పింది.

గిరిజ రాగానే ఇర్పి కొంచెం పక్కకు జరిగి చోటిచ్చింది. "ఆ అక్కలను పిలవలేదా జైని— వాళ్ళు మీటింగ్‌లోకి రారా" అంటూ జైని పక్కన కూచుందీ గిరిజ.

"చెప్పి చూశానక్కా. దాదలందరు ఉన్న కూడ మీటింగ్ వరకు రావటమే కొంత మార్పు. మరీ ఇపుడే బలవంత పెట్టొద్దనీ నేనే ఊరుకున్నా" నంటూ ఆచా రాలు, రివాజుల విషయంలో బలవంతం చేయటం, తొందరపాటుతో వ్యవహరించటం మంచిది గాదని కమాండర్ తరచూ చెబుతూండే విషయాలను గుర్తుకు తెచ్చుకుంటు న్నట్లు, ఆ విషయం ఇక వదిలేయ్ అన్నట్టు మాట్లాడింది జైని.

గిరిజ చూపులు ఇర్పి ముఖం పై పడ్డాయి.

ఇర్పి చాలా అందంగా ఉంటుంది. తెల్లని ఛాయ. నల్లని వెంట్రుకలు కాక పోతే ఆ కురులు కురుచ. ముచ్చటైన పలువరుస. చిరునవ్వు ముఖం. ఆ మొగంపై

ఐదు పచ్చబొట్లు. ఒకటి గద్వకు రెండు కణతల్లో రెండు, మరొకటి చెంపకు, మరోటి నుదుటిమీద బొట్టులా కొట్టొచ్చినట్టు కనబడుతుంది. 'ఆ పచ్చబొట్లే లేకుంటేనా'! అనుకున్న గిరిజ ఆ గుంపులో కూచున్న వయసుబడ్డ స్త్రీలతో పోల్చుకుంటే ఒంటి నిండా ఆ పచ్చబొట్లు, మెడలు వంగిపోయేలా ఆ పూసల హారాల కంటే ఈనాటి ఈ పడుచువాళ్ళు చాలా మెరుగేలే అనిపించింది.

"ఇర్పక్కా! పచ్చబొట్టు కర్రిబడిందేమక్కా" గిరిజ పలకరించింది.

ఇర్పి జవాబు చెప్పలేక తలవంచుకుంది. జైని కూడ తన చెంప తడుముకో సాగింది.

"గిరిజక్కా. ఇది కూడా అదే బాపతు. ఈ పచ్చబొట్టు తీసేసుకోవాలనుకుంటే అవి నల్లబొట్లుగా తయారవుతున్నాయి." అంటూ తన చెంపనున్న మచ్చ చూయించింది.

"ఈ బొట్లు చెరుపుకోవాలనీ ఏం చిట్కాలు చేస్తున్నరు తల్లీ" అంటూ విసుక్కుంది గిరిజ.

"సోడాపుప్పు, సున్నమూ, నల్లజీడీ తప్ప యింకేముంది తల్లీ. అయినా నీలాటి కూతురే ఉంటే మాకీ బాధలే వుండవు కదా!" అంటూ నవ్వుతూనే అంటించింది జైని. తల్లిలాంటి పిలుపులు నచ్చవని ఎంత చెప్పినా గిరిజకు అలవాటు ప్రకారం నోరు జారుతూనే ఉంటుంది.

"చూడు ఇర్పక్కా! ఒక బొట్టు బదులు మరో మచ్చ చేసుకున్నావ్. వాటిని ఇలా ఆతృతపడి ముఖం పుండు చేసుకోవడం మంచిది గాదు. మీ తల్లుల్లా మీ ఒంటి నిండా పచ్చబొట్లు, హారాలు ఉండడం లేదు కదా. మీరంతా యివాళ సంఘాల్లోకి వస్తే రేపు మీ పిల్లలకు పచ్చబొట్లు, వాతలు అసలే వుండకపోవచ్చు. ఓపిగ్గా వుండాలి తప్ప, నాజూకు కోసం యిలా ఒళ్ళు పొక్కచ్చుకుంటే ఏం లాభం?"

"నాజూకు కాదు గిరిజక్కా. దాని విచారం దూసురామంత." (వేరే ఉంది) అంటూ కిసుక్కుమంది జైని.

"ఏయ్, జైని హూడా" (చూడు) అంటూ చెప్పితే బాగుండదన్నట్టు బుంగమూతి పెట్టింది ఇర్పి.

"నువ్వే చెప్పు మరి" అంటూ గిరిజ ఇర్పినే ప్రోత్సహించింది.

"సిగ్గక్కా. సిగ్గు. అది ఊల్లెకు వల వేస్తుంది. ఆ విషయం అదే ఎట్ల చెప్పుతుంది?" అంటూ జైని చెప్పేసింది.

"పచ్చబొట్లకు-మన ఉల్లెకు పొత్తేమిటి? అతనికి కూడ నుదుట ఉందికదా! ఈవిడకుంటే వద్దంటాడా ఏంటి? ఎలాగు మనవాడికి ఈవిడగారు పుటులే కదా. అయినా ఉల్లెమీద మనసు పెట్టుకొని ఇంట్లో కూచుంటే ఎట్లవుతుంది" అని గిరిజ కొంటెగా యిర్పిని పొడిచింది.

"అది కాదక్కా. పట్నం వాళ్ళని, దళం వాళ్ళని చూసేక మాక్కూడ అలాగే ఉండాలనిపిస్తుంది. దళంలోకే వచ్చి ఉల్లెని కొంగున కట్టుకోవాలనీ యిర్పి పచ్చబొట్లకి యీ చిట్కాలు చేస్తుంది." అంటు జైని మొత్తం బయటపెట్టింది.

"పచ్చబొట్లుంటే దళంలో తీసుకోరనే రూలేమి లేదుకదా" అనేసరికి ఇర్పి గిరిజ తుపాకీని పట్టుకుంటూ "నేను కూడ వస్తానక్కా" అంది.

ఇలా ఒక్కొక్కర్నే పరామర్శిస్తూ చనువుగా వారి వారి సంగతులు తెలుసు కుంటూ వుండగా సీదో-మినో్కలు కూడ వచ్చి చేరారు.

నెలకో, రెన్నెల్లకో ఓసారి వచ్చినా, ఒకే పూట వున్నా దళం అక్కలు వూరందరికీ ఎవరికి వారికే తమ స్వంత చుట్టాలనిపిస్తారు. చెప్పుకోలేని రోగాలు నొప్పుల దగ్గర్నుండి సౌత్తీలు, స్వంత వ్యవహారాల వరకూ ఏ సంగతయినా కడుపులో మాట మనసు విప్పి మాటాడుకుంటారు. వూళ్ళోనికి దళం వస్తేనే అందరూ ఎంతో ఉత్సాహంగా వుంటారు. ఆ వూళ్లోని యువతీ యువకులందరూ దళంలోని సభ్యులను ఆదర్శంగా తీసుకొని వారిని అనుకరించడానికి ప్రయత్నిస్తుం టారు. ఆ ఊళ్ళోకి దళం వచ్చిందంటేనే దళ సభ్యులందరితోపాటు వూరి పిల్లలు ఎక్సర్‌సైజు, డ్రిల్లు చేస్తారు. తుపాకులు భుజాలకు తగిలించుకొని మార్చింగ్ చేస్తారు. కిట్లు వేసుకుంటారు. పాటలు-డాన్సులు చేస్తుంటారు. దళ సభ్యులను పేరు పేరున పలకరిస్తారు.

"అక్కలూ! యింక మీటింగ్ అయిపోలేదా, పాటలు పాడండి." అంటూ వూడిపోతున్న లాగు పైకి లాక్కుంటూ, గుండీలూడిపోయిన అంగీ రెండు చేతులా సవరించుకుంటూ బాల సంఘం ప్రతినిధి యంగ్ కామ్రేడ్ పొరియ తయారయ్యాడు. కారుతున్న చీముడి మీద ధ్యాసే లేదు. నోటికి పులుపు తలిగితే తప్ప పట్టించుకోడు పొరియా.

"పొరియా నీకే నా ఓటు" అంది మినో్క.

"ఎన్ని పాటలు పాడినా యింకా పాడమనటమే గానీ నువ్వు ఒక్కటీ నేర్చు కోవు కదా" అంటూ గిరిజ వెక్కిరించింది.

"నేర్చినక్కా. కానీ దీని యవ్వా యాదికుండదు అది." అంటూ బుంగమూతి పెట్టి "కమలక్కా పాటే పాడండక్కా, అది పాడితే ముసలోల్లు ఉడుక్కుంటరు." అంటూ పాటలు మొదలెట్టాలని పట్టేడు పొరియా.

పాటలనగానే జైని క్షణంలో నోటు బుక్కందుకుంది. అన్ని దళంలో పాడే పాటలు అందులో రాసుకుంది. ఏ దళం కలిసినా పాటలు సేకరించడం జైని పని. గాండో ఓపిగ్గా సాయం చేస్తుంటాడు. అందులో తెలుగు పాటలు కూడ ఉన్నాయి. తీరిక ఉన్న వేళల్లో వరుసగా అన్ని పాటలు పాడేస్తుంది దళం. కమలక్క పాట పాడడానికి జైని సిద్ధమవుతూంది.

రుషి అటువైపు రావడంతో పాటల కార్యక్రమం వెనక్కిపోయింది. దళం అక్కలతో పాటుగా కూచున్న రుషి మహిళా సంఘాల అవసరాన్ని చెప్పడంతో అక్కడున్న అక్కలందరూ సంగాన్ని ఏర్పర్చుకొని ముగ్గురిని ముఖ్యులుగా ఎంచుకున్నరు. ఇర్పి, మెంతక్క పిల్లీబాయిలు సంగంలో ముఖ్యులుగా పనిచేస్తామని కిరియ (ప్రతిజ్ఞ) చేశారు.

దళ సభ్యులు పాటలు ప్రారంభించేసరికి దూరంగా ఉన్న వాళ్ళంతా కూడ అక్కడికి వచ్చి చేరారు. దళం పాడుతుంటే అందరూ కోరస్ కలిపారు. తర్వాత మీటింగ్ ముగిసిందని రుషి చెప్పడంతో అందరూ లేచి నిల్చున్నారు. నినాదాలు నేర్పించాలనీ, రుషి తను అన్నదానికి ఏ జవాబు చెప్పాలో ముందుగా వివరించాడు.

"కమ్యూనిస్టుపార్టీ" అనడంతో అన్ని గొంతులు "జిందాబాద్" అన్నాయి.

"ఆదివాసీ మహిళాసంఘటన్ – వర్ధిల్లాలి"

"దండకారణ్య కిసాన్ మజ్దూర్ సంఘటన – జిందాబాద్"

"నవజనవాది క్రాంతి – జిందాబాద్"

"లాల్ సలాం కామ్రేడ్స్ – లాల్ సలాం కామ్రేడ్స్"

అంతే! జనాలందరూ ఆప్యాయంగా దళం వారికి చేతులు కలిపారు. మిగిలిన అన్నం తేవడానికి యువకులు గంజాలు నెత్తిపై పెట్టుకున్నారు. ఎవరి దారిలో వారు ఊరి వైపు కదలారు. రుషి ఆగమనడంతో లెబుడు, దోలు, దోబిలు మాత్రం ఉండిపోయారు.

(ఇంకా ఉంది)

చంద్రమౌళి సంస్మరణ :

# చంద్రార్ధమౌళి

అతడు నాకు బాగా గుర్తు. ఎప్పుడో కొన్నివేలవేల ఏళ్ళక్రితం చూసానతణ్ణి మొదటిసారి. అతడు నా తమ్ముడో, నా పక్కింటి మనిషో ఏదో ఒకటి అయ్యుంటాడు.

తుపాన్లో శివమెత్తిన సముద్రం అతణ్ణి అతని చిన్న తెప్పనీ ఆకలిగా ఆబగా మింగేసుంటుంది. తేనె కోసం వెళ్ళిన అతణ్ణి ఏ సింహమో నమిలేసి త్రేన్చేసి వుంటుంది. మోయలేని బరువులు మోస్తూ కళ్ళు తిరిగి మెడలు విరిగి కళ్ళు మూసివుంటాడు. ఘాతంలాంటి యంత్రం కోరల్లో చిక్కి నలిగి గుర్తయినా పట్టలేని శవంలా బయటికి విసిరివేయబడి వుంటాడు. అతడు ఆరోజు యింటికి తిరిగిరాలేదు....

అతడు ఎవరు? చంద్రమౌళి. ఐ. చంద్రమౌళి. ఆగస్టు 6న- అవును. చుండూరు దళితులపై మారణకాండ జరిగిన రోజే అతడు బెంగళూరులో రోడ్డు ప్రమాదంలో మరణించాడు. అతడెక్కిన బండి బహుళజాతి కంపెనీల వేగంతో జూమెక్కించేది. అతణ్ణి చంపిన ట్రక్కు డ్రైవరు ప్రభుత్వ సారామత్తులో బ్యాలెన్స్ తప్పాడు. అది ప్రమాదమే. అసమసమాజ మానవ ప్రయాణంలో చాల సహజమైన ప్రమాదం.

ఇంటూరి చంద్రమౌళి కేరళనుంచి వెలువడే 'దీపిక' పత్రికకు బెంగళూరు రిపోర్టర్. అంతకు ముందు అహ్మదాబాదులోను, బెంగళూరులోను ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌కు రిపోర్టర్. అనంతపురం జిల్లా కళ్యాణ్‌దుర్గ్‌లో పుట్టి తిరుపతి, ఢిల్లీలలో ఎం.ఎ. పురాతత్వ సమాజ శాస్త్రాలు, మాస్ కమ్యూనికేషన్స్ చదివాడు.

ఢిల్లీ జెఎన్‌యు విద్యార్థిగా నక్సల్బరీ రాజకీయాలతో ప్రభావితుడై 'ప్రగతి సాహితి', ఢిల్లీ విరసం యూనిట్ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొన్నాడు. '83 విరసం సాహిత్య' పాఠశాల (బెజవాడ)లో రావిశాస్త్రి, 'నిజం' నాటకం నుంచి ప్రదర్శించిన ఒక దృశ్యంలో పాత్రధారి. నిరంతర అధ్యయనశాలి మాత్రమే కాదు రచనాసక్తి వున్నవాడు. ఎన్నో కవితలు రాసాడు. ఎవరో కొందరు మిత్రులకుతప్ప

ఎవరికీ చూపలేదు. ఏ పత్రికకూ పంపలేదు. ఢిల్లీలో విద్యార్థిగా వున్నపుడు ఇటాలియన్ కమ్యూనిస్టులైన సాకో, వాంజెట్టీల ఉరితీత గురించి హోవార్డ్ ఫాస్టు రాసిన ఇంగ్లీషు పుస్తకాన్ని అనువదించాడు. అదీ అముద్రితమే.

సాహిత్య సాంస్కృతిక రంగాలకన్నా పత్రికా రంగానికి, పౌరప్రజాతంత్ర ఉద్యమానికి ఆయన చేసిన సేవలకు ఆధారాలయినా మిగిలివున్నాయి. ఎక్కడవున్నా, ఏ పత్రికలో పనిచేసినా ఒక్కడుగానైనా, నలుగురితో కలిసయినా పౌర, ప్రజాతంత్ర హక్కుల గురించి రాసీ, తెలియజేసీ, పనిజేసి తన చైతన్యాన్ని నిలుపుకున్నాడు.

కర్ణాటక పౌరహక్కుల సంస్థ కెసిఎల్‌సి స్థాపక సభ్యుడు. కర్ణాటక వెట్టి కార్మికుల విముక్తి పోరాటాల గురించి గానీ, కర్ణాటకలో జననాట్యమండలి సాంస్కృతిక పర్యటన గురించిగానీ, బీదర్, రాయచూర్, కోలార్ లలో రైతుకూలీ ఉద్యమ నిర్మాణం గురించిగానీ, బీదర్‌లో సిక్కు విద్యార్థుల హత్యాకాండపై జరిగిన న్యాయ విచారణ గురించిగానీ ఆయన రాసిన రిపోర్టులు, చూపిన ఆసక్తి, గౌరవా ప్రతి ప్రజాతంత్ర పత్రికారచయిత పరిశీలించదగినవి. బెంగళూరు విశ్వవిద్యాలయం ఇంగ్లీషు రీడర్ బాబయ్యగారిని అరెస్టు చేసినపుడు కెసిఎల్‌సి బెంబేలు పడిపోతే గుంభనంగా స్థిమితంగా ఆ వార్తను వెలుగులోకి తెచ్చి అండగా నిలిచినవాడు చంద్రమౌళి.

ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘానికి ఆయన అప్రకటిత ప్రవాస క్రియాశీలి. సృజన సాహితీమిత్రుడు. విరసం, అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమాఖ్యలకు సభ్యత్వ ప్రమేయం లేని సహచరుడు కామ్రేడ్.

ఇండియన్ ఎక్స్‌ప్రెస్ – బెంగుళూరులో పనిచేస్తుండగానే అదే పత్రికలో రిపోర్టర్ చంద్రికతో పెళ్ళయింది. వాళ్ళకు వెన్నెలవంటి రెండేళ్ళ పాప.

....అతని పాత్ర అంతటితో ముగిసింది. అన్ని వస్తువుల్లోకి తన ప్రాణం నింపి అతను మాత్రం ఇంకోచోటికి వెళ్ళిపోయాడు.

అతడు లేడు. అతని రక్తం, ఊపిరి, ప్రాణం నిండిన వస్తువులు వున్నాయి. జీవంలేని అతని కాళ్ళ స్థానంలో యింకో జతకాళ్ళు నిశ్శబ్దంగా వచ్చి చేరుతాయి. 'మనిషి' మరణిస్తాడు. 'మనుషులు' వుంటారు. పనులన్నీ సాఫీగా జరిగిపోతాయి.

—'సాహితీమిత్రులు'

# ప్రజ

మూలం : పాబ్లోనెరూడా THE PEOPLE

స్వేచ్ఛానువాదం : చంద్రమౌళి

అతడు నాకు బాగా గుర్తు
ఎప్పుడో కొన్ని వేలవేల ఏళ్ళక్రితం చూసానతణ్ని మొదటిసారి
అతడు గుర్రాలెక్కలేదు, బళ్ళు ఎక్కలేదు
పల్లకిలో ఊరేగలేదు-
అనంతదూరాలన్నీ మొద్దుబారి చీలిన
తన నగ్నపాదాలపైనే గమించాడు

అతని చేతుల్లో కత్తులూ, కటార్లూ ఎప్పుడు చూళ్ళేదు నేను
భుజంపై సుత్తీ, కొడవలి, గొడ్డలి, పార, నాగలి
అతని అస్తిత్వంలో ఓ భాగం
తన వాళ్ళతో ఎప్పుడూ పోట్లాడలేదతను
అతని పోరాటం అంతా నేలా, నీళ్ళూ, ప్రకృతీ, క్రూరతరోత్కటకాలతో
ఆకాశాన్నంటే చెట్లను కూల్చి ఇళ్ళను దూలాల్ని కిటికీల్ని అమరుస్తాడు
మట్టితో గోడల్ని కట్టి, గోడలకు తలుపులు తెరుస్తాడు
సుళ్ళుతిరిగే సముద్రంలోకి దూకి
రత్నరాసులు తెస్తాడు
మానవకోటికి ప్రాణదానం చేస్తాడు
అతడు నాకు బాగా తెలుసు – అతడు నాలోనే వున్నాడు ఇంకా
రథాలు పల్లకీలూ అన్నీ కాలగర్భంలో కలిసాయి
రాజ్యాల దండయాత్రలో ఇళ్ళూ, భవంతులూ
దుస్తులూ, నగరాలూ, నగలూ అన్నీ మట్టిపాలయినాయి
కాని అతడుమాత్రం
ఆ దుమ్ముకింద ఊపిరిపీలుస్తూ, నాకోసం
మిగిలి ఉంటాడు – సజీవంగా
ఒకప్పుడు అతను తప్ప అన్నీ
శాశ్వతాలనుకున్న ఆ గుర్తులేని వస్తువుల
బూడిదకుప్పల మధ్య....

యుగాల ప్రవాహంలో
వంశాల అనుక్రమణలో
అతడు నా తండ్రో, తమ్ముడో, నా పక్కింటి మనిషో
ఏదో ఒకటి అయ్యుంటాడు
తుఫాన్లో శివమెత్తిన సముద్రం అతణ్ని అతని చిన్న తెప్పనీ
ఆకలిగా ఆబగా మింగేసుంటుంది—
తేనెకోసం వెళ్ళిన అతణ్ని
ఏ సింహమో నమిలేసి త్రేన్చేసి వుంటుంది
మోయలేని బరువులు మోస్తూ కళ్ళు తిరిగి
మెడలు విరిగి కన్నుమూసివుంటాడు
భూతంలాంటి యంత్రం కోరల్లో చిక్కినలిగి
గుర్తయినా పట్టలేని శవంలా బయటికి విసిరివేయబడి వుంటాడు
ఆరోజు అతడు యింటికి తిరిగి రాలేదు....

అతడు ఎవరు?
ఇనుపముక్కలా కొయ్యదూలంలా
అతనికి వేరే పేరేం వుండదు
బారులు బారులుగా
నడుస్తూపోతున్న చీమల్లో చీమలా
అతనికి వేరే అస్తిత్వం ఏమీలేదు
అందుకే అలసిన అతని కాళ్ళు
ఒక్కసారిగా నిలిచిపోయి అతడు కూలబడి చచ్చిపోతే
ఎవ్వరూ అతణ్ని చూడలేదు
మందల్ని చూడ్డానికి అలవాటు బడ్డ కళ్ళు
అతని ఉనికిని పసికట్టవు.
జీవంలేని అతనికాళ్ళ స్థానంలో
యింకో జతకాళ్ళు నిశ్శబ్దంగా వచ్చి చేరతాయి
'మనిషి' మరణిస్తాడు 'మనుషులు' వుంటారు
పనులన్నీ సాఫీగా జరిగిపోతాయి—

అతని స్థానంలో యింకో మనిషి
అచ్చం అతన్లాగే! అలాంటి కాళ్ళే, అవే చేతులూ కళ్ళూ!
అంతా అతడే! అతడు అలాగే మిగిలివున్నాడు
బ్రతుకంతా శ్రమించి, శుష్కించి రాలిపోయాడనుకున్న
అతను — మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు — అదే రూపంలో
అదుగో ఎక్కడ చూసినా అతనే
నేల దున్నుతూ —
గుడ్డలు నేస్తూ
నగ్నంగా, ఆకలితో, అలసటతో....
ఎక్కడ చూసినా అతనే
ఈ క్షణం రాలిపోయి యింకో క్షణం పుట్టుకొస్తూ
అతను మళ్ళీ మళ్ళీ వస్తూనే ఉంటాడు
అతని గోరీపై అందమైన నగిషీల స్మారక చిహ్నాలు లేవు
అతని సమాధిపై పాలరాతి ఫలకాలు లేవు
చెమటోడ్చి చెక్కిన రాళ్ళపై అతనిపేరుండదు
అతను ఎప్పుడు వస్తాడో
ఎప్పుడు నిష్క్రమిస్తాడో, ఎవ్వరికీ తెలీదు
ఎవ్వరూ చూడకుండా, ఎవరికీ తెలీకుండా
అతను మాత్రం మళ్ళీ ప్రాణం పోసుకుంటాడు
మళ్ళీ మనమధ్య ఏం జరగనట్లు నుంచుంటాడు

అతను కూడా మనిషే !
కానీ .... అతనికి
ఆస్తుల్లేవు, పొలాల్లేవు, భవంతుల్లేవు
అతన్లాంటివాళ్ళ మహాసముద్రంలో
అతను ఓ బొట్టు -
ఆ బొట్టు సముద్రంలోంచి ఎప్పుడూ పైకి ఎగర్లేదు -
తన వాళ్ళ నెప్పుడూ వదల్లేదు -

నగరాలు వెలిసాయి
కొత్త కొత్త మనుషులు వచ్చారు -

రైళ్ళు పరిగెత్తాయి -
విరామ మెరుగని అతని శ్రమ ఫలితం
అందమైన లోకాన్ని నిర్మించింది
నాగరికత పులుముకున్న ఆ వ్యాపార ప్రాంతాల్లోకి
వసంతం వచ్చింది, మెల్లగా నడుస్తూ
పావురాల మధ్య హోటల్స్ మధ్య

కానీ ....
రొట్టెను చేసిన ఆ చేతుల్ని మరచిపోయారు
మళ్ళను ఏరీ, రాళ్ళను కొట్టీ
చెమటా మట్టీ కలిపివేసిన గట్టి రోడ్లపై
అందమైన కార్లలో చెట్లనీ, లోయల్నీ, మబ్బుతునకల్నీ
చూస్తూ వేగంగా వెళతారు -

అతని పాత్ర అంతటితో ముగిసింది
అన్ని వస్తువుల్లోకి తన ప్రాణం నింపి
అతను మాత్రం యింకోచోటికి వెళ్ళిపోతాడు
తలవంచుకుని ఎవరికీ తెలీకుండా....
ఇంకో ఎడార్ని స్వర్గంగా మలచడానికి
ఇంకో సముద్రాన్ని మళ్ళించడానికి -

చివరికి,
అతని కూలిన బ్రతుకు కుటీరం ముంగిట్లో
మృత్యువు పదధ్వనులు వినిపిస్తాయి -
నిశ్శబ్దంగా తలుపు తెరచుకొని చావును కౌగిట్లోకి తీసుకుంటాడు
నదిలో దొర్లే రాయిలా అతణ్ని మృత్యువు మోసుకెల్తోంది

అతడు నాకు బాగా తెలుసు
అలా కొట్టుకు పోతూంటే
ఆ గట్టుమీంచి చూస్తూవున్నాను
ప్రవాహం అతన్ని మింగేసేదాకా
నా వెనుక -

అతడు నిర్మించిన సుందరనగరం - ఇళ్ళూ, వాహనాలూ, బాటలూ -
అతడు కట్టిన ఆ ఇళ్ళలో అతనెప్పటికీ, ఎప్పటికీ కాలు మోపలేడు
అతడు వేసిన బాటల్లో అతని ఊపిరి నిండివుంది
అతడు లేడు - అతని రక్తం, ఊపిరి, ప్రాణం
నిండిన వస్తువులు వున్నాయి -

నేను వెనక్కి తిరిగా అతణ్ణి చూడాలని
రోజూ అక్కణ్ణే అతనికోసం ఎదురుచూస్తా -
అతని సమాధికోసం వెతికా పిచ్చిగా
అడుగో అతడు తన్ను దాచుకున్న నేల చీల్చుకుంటూ
మట్టి దులుపుకుంటూ లేస్తున్నాడు నావైపు వస్తున్నాడు
లక్షలాది మట్టి మనుషుల మధ్యనుండి
అతణ్ణి నా చేతుల్లోకి తీసుకున్నా
నా గుండె చెరువయింది రక్తం మరుగుతోంది
మానవాళికి సుందర స్వప్నాల్నీ సుఖాల్నీ యిచ్చి
ఎవరికీ తెలీని అడవిలో
ఎండుటాకులా రాలిపోతున్న అతడు
యిలా ఇంకోసారి ఇతర్లకు
సుఖాల్నీ, సంపదల్నీ యివ్వటానికి
మళ్ళీ, మళ్ళీ పుట్టడంలో అర్థంలేదు !

అతనికో స్వర్గం యివ్వాలి
ఆ స్వర్గంలో మంచిదుస్తుల్లో, పట్టుకుచ్చుల తలపాగాలో
నవ్వుతూ వుంటే చూడాలి నేను -
అతడు సృజించిన వస్తువులకు అతడు యజమాని కావాలి
అతడు పండించిన గింజలు యిన్నాళ్ళ అతని
మాడిన కడుపులో అమృతం సోనలు కురవాలి
గనుల లోతుల్లో శ్రమించే వాళ్ళ జీవితాల్లో
వెలుగుల వెల్లువలు నిండాలి !
మనిషిని పశువులా గొలుసుల్లో కట్టివేసే
క్రూరవ్యవస్థ పెత్తనం యికపై సాగదు !
స్పందనా జీవంలేని ఈ చీకటి
బ్రతుకులపై ఈ క్షణమే ముట్టడి ప్రకటిద్దాం !
మన జీవితాల్ని శాసించే అధికారాల్ని

చట్టాల్ని ఈ క్షణమే నేలమట్టం చేద్దాం
తరతరాల శ్రమలో గట్టిపడిన మొద్దుబారిన
ఈ చేతులకి బంగారు తొడుగులు వేసి ముద్దు పెట్టుకుంటా !
తూర్పున ఉదయిస్తోన్న ఆ కొత్త సూర్యుడి కాంతి
అందరికీ సమానంగా ప్రసరిస్తా !
పెత్తందారీ రాచరికం చరిత్ర పుస్తకంలో
ఆఖరు పేజీ యిప్పుడే రాస్తా

* * * * *

అతడు నాకు బాగా తెలుసు - వెళ్ళిన
అతని కోసం సమాధులన్నీ వెతికా పిచ్చిగా
ఇంకా తెరుచుకున్న ఆ కళ్ళకోసం, ఇంకా వినిపించే ఆ గొంతుకోసం
ఇంకా దుమ్ము పట్టని ఆ చేతుల్ని
నా గుండెల కదుముకుంటూ అతనితో
మెల్లగా మాట్లాడా వణికే గొంతుతో
"లోకంలో అన్నీ మట్టిలో కలుస్తాయి
కాని నువ్వుమాత్రం సజీవంగా ఉంటావు
నీకు మాత్రం చావు లేదు"
జీవితాల్ని వెలిగించావు నువ్వు !
ప్రపంచాన్ని నిర్మించావు నువ్వు !
ఇదంతా నీదే, నీ స్వంతం
నేనీరోజు ఒంటరివాణ్ని కాను
అందరి గుండెల్తో కలిసి
నా గుండె స్పందిస్తోంది
అందరి గొంతుల్తో కలిసి
నా గొంతు పాడుతోంది
నా మాటలెవరో వింటున్నారు, వాళ్ళకు తెలీకున్నా
నా పాటలోని వాళ్ళ 'ఆ మనుషులు'
పుట్టుకొస్తుంటారు - ప్రపంచాన్ని జీవంతో నింపుతారు

(సృజన - అక్టోబర్ 1983 సంచిక నుంచి పునర్ముద్రితం)

# స్వీకారం

* మండుతున్న చుండూరు - వచన కవితలు - పాటలు, సం : వి. చెంచయ్య విరసం నెల్లూరుజిల్లా యూనిట్ ప్రచురణ, 18 పేజీలు, 1/8 డెమీ, రూ. 2/-
* నర్మెట్ట నా తల్లి - కవితలు - కో. ప్ర. - విరసం నెల్లూరు జిల్లా యూనిట్ ప్రచురణ, 32 పేజీలు, 1/8 డెమీ, రు. 5.
* రక్తసిక్త సోపానాలు - కవితా సంకలనం - చంద్రహాస - విరసం అనంతపురం జిల్లా యూనిట్ ప్రచురణ, 72 పేజీలు, 1/8 డెమీ, పదిరూపాయలు,
* సెంట్రీ - విప్లవ కవితా సంకలనం - విరసం మహబూబ్‌నగర్ జిల్లా యూనిట్ ప్రచురణ, 56 పేజీలు, 1/8 డెమీ, ఐదు రూపాయలు,

పై నాలుగు పుస్తకాలు ప్రతులకు : వి.చెంచయ్య, 6-5-13, కావలి, నెల్లూరు జిల్లా, 524 201

* ప్రజ - శ్రీశ్రీ - శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం - 19, సం. చలసాని ప్రసాద్ విరసం ప్రచురణ, 362 పేజీలు, 1/8 డెమీ, 45 రూపాయలు. డిస్ట్రిబ్యూటర్స్ : నవయుగ బుక్‌హౌస్, సుల్తాన్ బజార్ హైదరాబాద్, 500 195
* యానగాలి, కవితా సంపుటి — శ్రీకాకుళ సాహితి, వెలుగు ప్రచురణ, 56 పేజీలు, 1/8 డెమీ, ఎనిమిది రూపాయలు, ప్రతులకు : శ్రీకాకుళ సాహితి, బి. వి. ఎ. రామారావు నాయుడు, గుజ్జెలవారి మేడ, చిన్నబజారు వీధి, శ్రీకాకుళం, 532001
* 'చేరా'తలు - సాహిత్య విమర్శ - పరామర్శ చేకూరి రామారావు సం : దేవిప్రియ, చరిత ప్రచురణలు, 228 + ×× పేజీలు, 1/8 డెమీ, 35 రూపాయలు, ప్రతులకు : పి. సుబ్బయ్య, 5-8-300, చిరాగ్ అలీలేన్, ఆబిడ్స్ హైదరాబాద్ 500 001.
* The chundur carnage-APCLC, 20 pages, 1/8 demy, Rs 2/- For copies : S S C Bose, Ramanadham chamber of law, Peddibhotla vari veedhi, Governorpet, Vijayawada 520 002
* ప్రజలపై ఉక్కుపాదం - ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ, 22 పేజీలు, ఒక రూపాయి, ప్రతులకు : ఎం. కోదండరామరెడ్డి, 1-9-02/2, విద్యానగర్, హైదరాబాద్ 500 044, 2. బావలి సుధాకరరావు, మరాఠీ పాలెం, ఒంగోలు, ప్రకాశంజిల్లా.

కబళించిన చాపను తిరిగి విసిరి గోడకు దిగ్గొట్టినవారెవరు ?


## సముద్రుడు

కవితా బులెటిన్

# భూమి నా తల వెల నిర్ణయించు

షైనింగ్‌పాత్ ప్రచురణలు, హైదరాబాదు

ప్రచురణ : ఏప్రిల్ 1991 వెల : 2 రూపాయలు

ప్రతులకు : పీస్ బుక్ సెంటర్, 1-8-518/16/2

వెంకటేశ్వరాలయం దగ్గర, చిక్కడపల్లి

హైదరాబాద్ - 500 020


---

SRJANA Telugu Monthly September 1991
Regd. No. with the Registrar of Newspapers for India 10953/67

# సృజన రేటు, సంవత్సర చందా పెంచక తప్పడంలేదు

సృజనకు ఆర్థికంగా, హార్దికంగా సహకరించవలసినదని చేస్తున్న విజ్ఞప్తికి ముఖ్యంగా మనసు విప్పి చెప్పుకున్న ఇబ్బందులకు కొందరు పాఠకులనుంచయినా మంచి ప్రతిస్పందన వచ్చింది.

అయితే కేంద్ర ప్రభుత్వ బడ్జెట్ రూపంలో వచ్చిన ఐ. ఎం. ఎఫ్. దాడికి పత్రికలుకూడా తాళలేనంత దెబ్బతిన్నవి. న్యూస్‌ప్రింటు ధర నలభై శాతం పెరిగిపోయింది. న్యూస్‌ప్రింటు కోటాకూడా లేని సృజన వంటి పత్రికలకు ఈ రేటు రెట్టింపు పెరిగినట్లు లెక్క.

పత్రికకయ్యే ఖర్చు సాధారణంగా కాగితానికి సగం, ప్రింటింగుకు సగం అవుతుంది (లెటరు ప్రెస్ కంపోజింగులో). కనుక పెరిగిన కాగితం ధర నలభై శాతమే లెక్కవేసుకున్నా అరవై పేజీల పత్రికకే మరో రూపాయి రేటు పెంచక తప్పదు. మేం ఇటీవల కాలంలో 70 పేజీలకు తగ్గి ఎప్పుడూ సంచిక ఇవ్వలేదు. గత సంచిక 106 పేజీలు 5 రూపాయలకే ఇచ్చాం.

ఇప్పుడే మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్లు బడ్జెట్ న్యూస్‌ప్రింటు ధర పెంచింది.

ఇకనుంచి తప్పనిసరిగా 64 పేజీల

విడి ప్రతి 5 రూపాయలు     సంవత్సర చందా 50 రూపాయలు

చేయక తప్పడంలేదు.

అన్నీ గ్రహించగల సృజన పాఠకులు సహకరించగలరని ఆశిస్తాం.

'సాహితీమిత్రులు'

SRJANA Rs. 5/-
Flat 11, Block 2,
MIG II, Baghlingampalli,
Hyderabad – 500 044.